# కాల్గేట్‌తో చెడ్డ శ్వాసను నిరోధించండి
# రోజంతా దంతక్షయం జరుగకుండా కాపాడుకొనండి!

ఎందుచేతనంటే: ఒక్కసారి తోముకుంటేనే కాల్గేట్ డెంటల్ క్రీమ్ నోటిలో దుర్వాసనను మరియు దంత క్షయమునకు కారణమైన సూక్ష్మ క్రిములను 85% వరకు తొలగించును.

కాల్గేట్ 10 మందిలో 7 గురికి చెడ్డ శ్వాసను వెంటనే నిరోధించిందని మరియు భోజనం అయిన వెంటనే కాల్గేట్ పద్ధతిలో పళ్ళు తోముకొనుట వల్ల ఎక్కువ మందికి దంతక్షయమును బాగా అరికట్టిందని, పూర్వము దంతశాస్త్ర చరిత్రలో ఎన్నడూ తెలియ జేయనంతగా శాస్త్ర పరిశోధనల వల్ల నిరూపించబడినది! ఒక్క కాల్గేట్ మాత్రమే దీనికి రుజువును కలిగివున్నది.

పిల్లలు కాల్గేట్‌తో క్రమంగా పళ్ళు తోముకునే అలవాటును తేలికగా అవలంబిస్తారు. ఎందుచేతనంటే ఎక్కువ సేపు నిలిచే దాని పిప్పర మెంట్ లాటి సువాసనంటే వారికి చాలా ఇష్టం.

శుభ్రత కొరకు, తాజా శ్వాసకొరకు మరియు పండ్లు తెల్లగా వుండుట కొరకు కాల్గేట్‌తో పండ్లను క్రమంగా తోముకొనండి.

మీకు పౌడర్ కావాలంటే, ఈ లాభములన్నింటినీ కాల్గేట్ టూత్ పౌడర్ ద్వారా పొందగలరు... ఒక దబ్బా నెలల తరబడి వస్తుంది...







...ప్రపంచములోని ఏ ఒక్క ఇతర డెంటల్ క్రీమ్‌కన్నా కాల్గేట్‌నే ఎక్కువ మంది వాడుతున్నారు

DCG.35 TL

# చందమామ

ఈ సంచికలో కథలు
వింతలు - విశేషాలు

★



ఇవి గాక ఫోటోశీర్షికల పోటీ మొదలైన మరి ఎన్నో ఆకర్షణలు.




LIFEBUOY
for health

అశోక

# ఆంగ్లేయ బోధిని

గ్రంథకర్త: విద్వాన్ A. సుబ్బారాయగుప్త, M.A., B.OL., B.Ed.

ఈ పుస్తక సహాయంతో పిన్నలూ, పెద్దలూ, ఆంగ్లములో అక్షరాభ్యాసము రానివారు కూడ 60 దినములలో **ఆంగ్లము** నేర్చుకొనవచ్చును. మా ఆంగ్లేయ బోధిని బాల, బాలికలకు చాలా సహాయపడు మిత్రుడు. దీనిలో ఇంగ్లీషుకు ఉచ్ఛరణ (Pronounciation) పలుకుటకు తెలుగులో వ్రాయబడి యున్నది. ఇదికాక మా ఆంగ్లేయబోధినిలో ఇంగ్లీషుకు తెలుగు గ్రామరు, వ్యాసము (Essay Writing), ఉత్తరములు వ్రాయుట (Letterwriting), సామెతలు (Proverbs), కథలు (Stories) మున్నగు విషయములు చక్కగా సులభ శైలితో వ్రాయబడియున్నది. సుమారు 600 పేజీలుగల ఈ పుస్తకము వెల రూ. 6-00. పోస్టేజి అదనము.

పలయువారు: **బాలసరస్వతీ బుక్ డిపో,**

(రిజిష్టర్డు) ఎడ్యుకేషనల్ పబ్లిషర్స్,

6, సుంకురామశెట్టి వీధి, మద్రాసు-1. Phone: **29868**

---

గృహము మనోహరముగా చిత్రమయముగా ఉండాలంటే!

గృహము అతి ఆధునికముగా నవ నవీనముగా ఉండాలంటే!

ఎప్పుడూ వాడవలసింది

# AMARJOTHI FABRICS

## BEDSPREADS - FURNISHINGS - FANCY TOWELS



A GREAT NAME 

IN HANDLOOMS

తయారీ:
అమర్‌జ్యోతి ఫాబ్రిక్స్,
పోస్టుబాక్సు నం. 22, కరూర్ (ద.భా.)
బ్రాంచీలు: బొంబాయి—ఢిల్లీ

మద్రాసు ఏజెంట్లు:
అమర్‌జ్యోతి ట్రేడర్స్,
99, గొడౌన్ స్ట్రీట్, మదరాసు: 1
ఫోన్: 34864



- ఆయుర్వేద సేవాశ్రమ్ యొక్క

# గొప్ప బహుమానము




## రూ. 1,00,000 లకు పైగా

(ఒక లక్ష రూపాయలు) 1,100 కంటే ఎక్కువ బహుమానములు



వీటిలోనుండి ఒక గొప్ప బహుమానము గెలవండి!

మొదటి బహుమానము:

ఎంబాసడర్ కారు

| ఇతర బహుమానములు | 4 వెస్పా స్కూటర్లు | 5 ఆల్విన్ రిఫ్రిజిరేటర్లు | 7 ... రేడియోలు | 25 ... టేబుల్ ఫ్యాన్లు | 100 ... ప్రెషర్ కుక్కర్లు | 250 బజాజ్ ఎలక్ట్రిక్ ఇస్త్రీలు | Rs. 30 VOUCHER |
|---|---|---|---|---|---|---|---|

## ఇది ఎంతో సులభము!

ఇతర పోటీలవలెగాక, ఈ పోటీలో ముందుగానే నిశ్చయించేసిన, సీల్ చేయబడిన సొల్యూషన్ లేదు. లేకపోవడమే గాకుండా, పోటీలో పాల్గొనే వారిలో ఎక్కువ మంది ఎందుకొన్న ఉద్దేశ్యముల ననుసరించి ఎలక్ట్రానిక్ మెషీన్లు పూర్తిగా సరియైన సొల్యూషన్‌ని ఇస్తాయి.

ఈ గొప్ప బహుమాన పథకమునకు సంబంధించిన సేవాశ్రమ్ యొక్క ఏ ఉత్పత్తినైనా మీరు కొనే అప్పుడు ప్రవేశపు టోకెన్ను తీసుకోవడం మరచిపోవద్దు.

మీరు చేయవలసినదల్లా సేవాశ్రమ్ డీలర్ వద్దకు వెళ్లి వారిని, బహుమానములను గురించి పూర్తి వివరములు వున్న ఉచిత ప్రవేశపత్రము కోసం అడగటమే. ఆ ప్రవేశపత్రములో 10 వాక్యములు వుంటాయి. మీరు వాటిని శ్రద్ధతో చదివి మీ ఉద్దేశ్యంలో, వాటిలో ముఖ్యమైనది ఏదో మీరు నిశ్చయించి దాని ఎదురుగా 1వ నెంబరు వ్రాయండి. తరువాత ఏది ముఖ్యమైన వాక్యమో నిశ్చయించి దాని ఎదురుగా 2వ నెంబరు వ్రాయండి. ఈ ప్రకారంగా మీరు ఎంచిన క్రమపద్ధతిలో 10 వాక్యములకు ఎదురుగా 10 నెంబరులను వ్రాయండి.

ఈ వాక్యములకు ఎదురుగా నెంబరులను వ్రాయడమేగాక, ఆయుర్వేద సేవాశ్రమ్ ఉత్పత్తులను ఎల్లాగ ప్రజాదరణ తీసుకురావడమో తెలిపేందు ఒక వాక్యమో (స్లోగన్) గాని లేక దానికి సంబంధించిన కొద్ది వాక్యములనుగాని వ్రాయండి.

**ఆయుర్వేద సేవాశ్రమ్ ప్రైవేట్ లిమిటెడ్**

ఉదయపూర్ - వారాణాసి - హైదరాబాదు
ఒక బజాజ్ గ్రూప్ సంస్థ

ముగింపు తేదీ : 31వ జూలై, 1968



TEACH YOUR CHILD
THE SAVING HABIT NOW...
WHILE LIFETIME
HABITS ARE BEING
FORMED.



ASOKA










# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

సార్థకజీవి అయినవాడికి కొన్ని నియమా లుండితీరాలి. అయితే నియమాలు మంచివైనంత మాత్రాన అవి సక్రమంగా అమలుకావు ; వాటికి అనుకూలమైన పరిస్థితులు కూడా ఉండాలి. ఈ నీతి "నియమభంగం" [బేతాళ కథ] లో ఉన్నది.

"ఇంద్రజాలం" అన్న కథ రాసిన వారు జగత్ప్రఖ్యాతి గల ఐంద్రజాలికుడు శ్రీ పి. సి. సర్కార్. ఈ కథలోని ఇంద్రజాలం అందరూ చేసిచూడవచ్చు.

సంపుటి 42 జూన్ '68 సంచిక 6



# భారత చరిత్ర



## 81. మహారాష్ట్రుల పతనం

రెండవ మహారాష్ట్ర యుద్ధం అయాక ఇంగ్లీషు వారి బలం చాలా పెరిగింది. మొగలు పాదుషా వారి పరిరక్షణ కిందికి వచ్చాడు. జోధ్పూర్, జయపూర్, బూందీ, భరత్పూర్ వగైరా రాజ్యాలతో వారు సంధులు చేసుకున్నారు. నిజామూ, పేష్వా వారికి మరింత లోబడిపోయారు. అయితే ఈ శాంతి దక్కలేదు. అంతవరకూ తటస్థంగా ఉన్న హోల్కర్, 1804 ఏప్రిల్‌లో, ఇంగ్లీషువారితో యుద్ధానికి తలపడ్డాడు. అతను ఆరంభంలో విజయాలు సాధించటమే గాక, ఒక వారంరోజుల పాటు ఢిల్లీని ముట్టడించాడు కూడా. కాని అక్కడ అతనికి అపజయం ఎదురయింది. అతను 1806 జనవరి 7 న ఇంగ్లీషువారితో సంధి చేసుకున్నాడు.

19 వ శతాబ్ది ఆరంభం నాటికి మహారాష్ట్ర సంస్థానాలన్నీ అస్తవ్యస్తంగా ఉన్నాయి. అది మహారాష్ట్రుల పతనదశ. జస్వంతరావు హోల్కరు తన సోదరుడైన కాశీరావునూ, అతని కొడుకైన ఖండేరావునూ హత్య చేయించి, ఉన్మాదానికి గురి అయి 1811 అక్టోబరు 20 న పోయాడు. అతని ఉంపుడుగత్తె అయిన తులసీబాయి, బలరామ్‌సేత్ అనే మంత్రినీ, అమీర్‌ఖాన్ అనే పఠాను నాయకుణ్ణీ అడ్డం పెట్టుకుని రాజ్యమేలింది. దౌలత్‌రావ్ సింధియా స్థితి ఎలా ఉన్నదంటే, అతను సైనికులకు జీతాలు కూడా ఇవ్వలేక, జనాన్ని దండుకోనిచ్చాడు. అతనికి సైన్యం మీద ఏమీ అధికారం లేకుండా పోయింది. రఘూజీ భోంస్లే రాజ్యం అరాజకంగా ఉన్నది; దాన్ని పిండారీలూ, పఠానులూ యథేచ్ఛగా కొల్లగొట్టుతున్నారు.

ఈ స్థితిలో కూడా మహారాష్ట్ర పాలకులు ఇంగ్లీషువారిని మరొకసారి ప్రతిఘటించ సంకల్పించారు. ఈ సంకల్పం బలంగా



కలిగినది రెండవ బాజీరావుకు. అతనికి ప్రేరేపకుడు త్రింబక్‌జీ దాంగ్లియా అనే వాడు. గాయిక్‌వాడ్ తన మంత్రి అయిన గంగాధరశాస్త్రిని 1814 లో పేష్వా వద్దకు రాయబారం పంపాడు. గంగాధరశాస్త్రి ఇంగ్లీషు పక్షపాతి. త్రింబక్‌జీ ప్రేరణతో పేష్వా గంగాధరశాస్త్రిని హత్య చేయించాడు. ఇంగ్లీషు అధికారులు త్రింబక్‌జీని థాణాదుర్గంలో ఖైదుచేశారు.

1817 నాటికి పరిస్థితి బాగా విషమించింది. ఇంగ్లీషువారిని ప్రతిఘటించటానికి గాను ఇతర మహారాష్ట్ర నాయకులనూ, పఠాను నాయకుడైన అమీర్‌ఖాన్‌నూ, పిండారీలనూ కూడగట్టటానికి పేష్వా తీవ్రంగా యత్నాలు సాగించాడు.

ఇంగ్లీషువారు చూస్తూ ఊరుకోలేదు. వారు బలాత్కారంగా రెండవ బాజీరావు చేత పూనా ఒడంబడిక పైన సంతకం చేయించారు. (1817 జూను 13). ఈ ఒడంబడికతో పేష్వాకు మహారాష్ట్ర సమాఖ్య నాయకత్వం ఊడింది; గాయిక్‌వాడ్ పై అతని కుండిన అధికారాలు సడలించబడ్డాయి; కొంకణం మొదలైన కొన్ని ముఖ్య ప్రాంతాలను ఇంగ్లీషువారికి సమర్పించవలసి వచ్చింది.



1817 నవంబరు 5 న దౌలత్‌రావు సింధియా చేత కూడా ఇంగ్లీషువారు గ్వాలియర్ సంధిపై సంతకం చేయించారు. ఈ సంధి వల్ల అనేక రాజపుత్ర సంస్థానాలు మహారాష్ట్రుల ఆధిపత్యం నుంచి విముక్తమయాయి.

ఇంగ్లీషు వారికి అచ్చివచ్చిన మూడవ సంధి నాగపూరు సంధి (1816 మే 27). రెండవ రఘూజీ భోంస్లే 1816 మార్చి 22 న పోయాడు. అతని కొడుకు పర్సోజీ వెర్రిబాగులవాడు. పర్సోజీ దాయాది అయిన అప్పాసాహెబ్ రాజప్రతినిధి అవుదామనే కాంక్షతో ఉండటం గుర్తించి, నాగపూరు

సంధి ద్వారా ఇంగ్లీషువారు అతని కోరిక తీర్చారు.

ఈ విధంగా ఇంగ్లీషువారి కబంధ హస్తంలో చిక్కటం మహారాష్ట్ర పాలకులకు ఇష్టంలేదు. వారికి పేష్వా ఆశయాల పట్ల సానుభూతి కూడా ఉన్నది. సింధియా ఇంగ్లీషువారి ఒడంబడిక పై సంతకం చేసిన రోజునే పేష్వా పూనాలోని బ్రిటిషు రెసిడెన్సీని నాశనం చేసి, తగలబెట్టి, 27 వేల సేనతో 2,800 మంది సైనికులు గల బ్రిటిషు సేనను ఖిడ్కి వద్ద ప్రతిఘటించి పోరాడి, ఓడిపోయాడు. పేష్వాలాగే నాగపూరులోని అప్పాసాహెబ్, ఇంగ్లీషు వారితో పోరాడి, 1817 నవంబరు 27 న సితాబల్డీ వద్ద ఓడిపోయాడు. జస్వంతరావు కొడుకు రెండవ మలహర్‌రావు హోల్కర్ కూడా ఇంగ్లీషు వారితో యుద్ధం చేసి మరుసటి నెలలో మహిద్పూర్ వద్ద ఓడిపోయాడు. అప్పాసాహెబ్ పంజాబుకూ, అక్కడ నుంచి జోధ్పూర్‌కూ పారిపోయి, 1840 లో మరణించాడు. నర్మదకు ఉత్తరంగా ఉండే ప్రాంతమంతా ఇంగ్లీషువారి అధీనమయింది. 1818 జనవరి 6 న హోల్కర్ మందసోర్ వద్ద ఇంగ్లీషువారితో సంధి చేసుకున్నాడు.

మహారాష్ట్ర సంఘటనా చిహ్నమైన పేష్వా పదవి రద్దయింది. ఇది జరిగే లోపుగా రెండవ బాజీరావు ఇంగ్లీషు వారితో రెండు సార్లు యుద్ధం చేసి, రెండుసార్లూ ఓడిపోయాడు. చివరకు ఇంగ్లీషువారు అతనికి ఏటా 6 లక్షల భరణం ఏర్పాటు చేసి కాన్పూరు సమీపంలో ఉండే బిఠూర్‌కు పంపేశారు. త్రింబక్‌జీ చునార్ దుర్గంలో యావజ్జీవ ఖైదుశిక్ష పొందాడు. సాతారా అనే చిన్న రాజ్యానికి శివాజీ వంశస్థుడైన ప్రతాపసింహు డనే వాణ్ణి రాజుగా ఏర్పాటు చేశారు.

భారతదేశంలో బ్రిటిషువారి అధికారం అపారంగా వృద్ధిచెందింది.






# కోలాహలపండితుడు

ఒకప్పుడు దక్షిణదేశంలో ఒక రాజుండే వాడు. ఆయన గొప్ప కళాపోషకుడుగా ప్రసిద్ధికెక్కాడు. ఆయన ఆస్థానంలో అనేక మంది కవులూ, పండితులూ, గాయకులూ మొదలైన కళాకారులుండేవారు.

అందరికన్నా రాజుగారికి హెచ్చుగా అభిమానపాత్రుడు కోలాహలపండితుడు. రాజ్యంలో అతనికి ఎంత స్వేచ్ఛ అయినా ఉన్నది. అయన మాటకు తిరుగులేదు. ఆయన ప్రతిచర్యనూ రాజుగారు సమర్థించుతాడు. అందుచేత ఆ రాజ్యంలో ఉండే వాళ్ళకు రాజుగారంటే ఎంత భయమో, అయన ఆస్థానంలోని కోలాహలపండితుడన్నా అంత భయమే.

రాజుగారికి తనపై గల ఆదరణను పురస్కరించుకుని కోలాహలపండితుడు ప్రజలను పీడిస్తూ ఉండేవాడు. అయితే ఈ సంగతి రాజుగారికి తెలియదు.

కోలాహలపండితుడు తనకు డబ్బు కావలిసినప్పుడు నగరంలో ఉండేవారికి ఎవరికైనా ఒక ఉత్తరం రాసి తన శిష్యుడి ద్వారా పంపేవాడు. వాళ్ళు వెంటనే డబ్బు ఇచ్చేసేవాళ్ళు. ఒకసారి కోలాహలపండితుడు తనకు వెంటనే నూటపదహార్లు పంపమని ఒక బ్రాహ్మణుడికి ఉత్తరం రాసి తన శిష్యుడి ద్వారా పంపాడు.

ఆ శిష్యుడు ఉత్తరం తెచ్చిన సమయానికి బ్రాహ్మణుడు ఇంట లేడు. అయన శిష్యుడు బయటి అరుగు మీద కూర్చుని వేదాధ్యయనం చేస్తున్నాడు. కోలాహల పండితుడి శిష్యుడు తాను తెచ్చిన ఉత్తరాన్ని ఆ కుర్రవాడికి ఇచ్చాడు. దాన్ని చదవగానే బ్రాహ్మణుడి శిష్యుడికి పట్టరాని ఆగ్రహం వచ్చింది. అత నా ఉత్తరాన్ని ముక్కలు ముక్కలుగా చించి, అవతల పారేశాడు.

కుమారి భారతి



అది చూసి కోలాహలపండితుడి శిష్యుడు భయంతో వణికిపోయాడు. బ్రాహ్మణుడి శిష్యుడు వాడితో, "మీ గురువుకు చెప్పు, ఇలాటి వెర్రిమొర్రి వేషాలు వేస్తే అయన పరువు దక్కదు. అటువంటివాడికి తొత్తుగా పనిచేస్తున్న నీకు కూడా దేహశుద్ధి చెయ్యవలిసిందే," అని కొట్టటానికి మీదికి వచ్చాడు.

కోలాహలపండితుడి శిష్యుడు పిక్కబలం చూపి, పరిగెత్తుకుపోయి, గురువుగారికి సాష్టాంగపడి, జరిగినదంతా చెప్పాడు.

అధికారమదం తల కెక్కిన కోలాహల పండితుడు ఉగ్రుడైపోయి, తన శిష్యుడికి



అవమానం చేశాడని బ్రాహ్మణుడి మీద రాజుగారితో ఫిర్యాదు చేశాడు. ఆ బ్రాహ్మణుణ్ణి వెంటనే తీసుకురమ్మని రాజుగారు తన భటులను పంపాడు.

తన కోసం రాజుగారు భటులను పంపారని విని బ్రాహ్మణుడు ఆశ్చర్యపోయాడు. జరిగిన సంగతి ఆయనకు తెలియదు. ఆయనకు శిష్యుడు జరిగినదంతా చెప్పి, గురువుగారిని క్షమాపణ వేడుకుని, రాజభటులతో, "మా గురువుగారికి ఈ వ్యవహారంతో ఏమీ సంబంధం లేదు. సంబంధం ఉన్నవాణ్ణి నేను. రాజుగారి దగ్గిరకు నన్ను తీసుకుపొండి," అన్నాడు.

అతను రాజుగారి వద్దకు వెళ్ళి, జరిగినదంతా చెప్పి, "మహారాజా, నే నీ కోలాహల పండితులవారిని బుద్ధిపూర్వకంగా అవమానించానని ఒప్పుకుంటున్నాను. కావలిస్తే మాకు పరీక్ష పెట్టండి. నేను ఓడిపోయిన పక్షంలో నన్ను మీ యిష్టానుసారం శిక్షించవచ్చు," అన్నాడు.

రాజుగారికి అది సబబుగానే తోచింది. కోలాహలపండితుడు కూడా ఆ కుర్రవాణ్ణి అవలీలగా ఓడించి, రాజుగారి చేత శిక్షింపజేసి తన కసి తీర్చుకుందామని ఎంతో ఉబలాట పడ్డాడు.





పండితసభకు ఉత్తరు విచ్చి, రాజుగారు లోపలి గదిలోకి వెళ్ళాడు. అక్కడ రాణికీ రాజుకూ కొంత చర్చ జరిగింది. కుర్రవాడు తెలివిగలవాడుగా కనిపిస్తున్నాడు, పరీక్షలో గెలుస్తాడన్నది రాణి. అలా జరగదన్నాడు రాజు. ఇద్దరూ తగాదా పడటం బ్రాహ్మణుడి శిష్యుడు విన్నాడు.

పండితసభ ఏర్పాటు అయింది. పాండిత్య పరీక్షకు ఆ దేశంలో గల సంప్రదాయ మేమంటే, ఒకరు చెప్పినదాన్ని రెండోవారు పూర్వపక్షం చెయ్యాలి. అవతలివాడు తన మాటలను పూర్వపక్షం చేయలేకపోయినప్పుడు సిద్ధాంతం చేసినవాడే తన మాటలను పూర్వపక్షం చేసుకోవాలి. అంత దాకా అవతలివాడు ఓడినట్టూ కాదు, తాను గెలిచినట్టూ కాదు.

"నన్ను మీరు ఖండిస్తారా? మిమ్మల్ని నేను ఖండించనా?" అని బ్రాహ్మణుడి శిష్యుడు అడిగాడు.

తనను ఆ కుర్రవాడు ఖండించట మన్న మాట వినవలసి రావటమే రోతగా తోచి, కోలాహలపండితుడు, "నిన్నే నేను ఖండిస్తాను," అన్నాడు.

"అయితే నేను చెప్పే విషయాలను మీరు ఖండించండి. ఒకటి, మీ తల్లి గొడ్రాలు కాదు. రెండు, ఈ రాజుగారు



ధర్మాత్ముడే. మూడు, రాణిగారు పతివ్రత!" అన్నాడు కుర్రవాడు.

వాటిని కోలాహలపండితుడే కాదు, ఆ సభలో ఎవరూ ఖండించలేరు. ఈ మాట లన్న కుర్రవాడి మీద సభలోని పండితు లందరికీ ఆగ్రహం వచ్చింది. జేవురించిన ముఖంతో కోలాహలపండితుడు, "నీ మాట లను నువే ఖండించి, విజయం సాధించుకో!" అన్నాడు.

బ్రాహ్మణుడి శిష్యుడు, "అలాగే చేస్తాను. మొదటి మాట, మీ తల్లి గోత్రాలు కాదన్నాను. ఒక విధంగా ఆమె గోత్రాలే. మీరు ఆమె కడుపున చెడబుట్టారు. ఇంత హీనుణ్ణి కన్న ఏ తల్లి కూడా తన కడుపు పండిందని అనుకోదు. రెండు, రాజుగారు ధర్మాత్ముడే నన్నాను. కాని నిజానికి కారు. వారే ధర్మాత్ములైతే మీ వంటి ప్రజాపీడకులను యథేచ్ఛగా రాజ్యంలో సంచరించనివ్వరు. మూడు, రాణిగారు పతివ్రత అన్నాను. కాని ఆమెలో పతివ్రతా లక్షణం ఒకటి లోపించింది. ఈ పరీక్షలో నేను ఓడిపోతానని రాజుగారు అన్నప్పుడు ఆమె తన భర్తతో వ్యతిరేకించింది. కాని ఆమె చెప్పినది నిజం: నేను గెలిచాను, మీరు ఓడిపోయారు," అన్నాడు.

కొంతసేపు సభలో ఎటువంటి శబ్దమూ లేదు. కుర్రవాడి మాటలకు అందరూ కొయ్యబారి పోయారు. చివరకు రాజుగారు, ఎంతో ధర్మబుద్ధి గలవాడు గనక, సింహాసనం నుంచి దిగి వచ్చి, బ్రాహ్మణుడి శిష్యుణ్ణి కౌగలించుకుని, "నాయనా, ఇవాళ నువ్వు నా కళ్ళు తెరిచావు. ఇలాటి ప్రజాపీడన నా రాజ్యంలో సాగుతున్నట్టు నా కిప్పటిదాకా తెలియదు," అన్నాడు. ఆయన బ్రాహ్మణుడి శిష్యుడికి అప్పటికప్పుడే తగిన విధంగా సన్మానం చేసి, కోలాహలపండితుణ్ణి తన కొలువులో నుంచి పంపేశాడు.





# శిథిలాలయం

## 6

[రాకాసిబొమ్మ ప్రమాదం నుంచి బయటపడి, శిఖిముఖీ, విక్రమకేసరీ కొండగుహల కేసి పోయేంతలో, తిమ్మగూడెం పల్లెలో నవరగండుపోతు ధాన్యం దోచుకుంటున్నట్టు, ఆ పల్లెవాడి ద్వారా వాళ్ళకు తెలిసింది. వాళ్ళిద్దరూ ఆ పల్లె చేరారు. నవరగండుపోతు, శిఖిముఖిని చూసి మండిపడి, ఈటె తీసుకుని అతడి మీదికి దూకాడు. తరవాత—]

కొండప్రాంతాన శిఖిముఖీ, విక్రమకేసరు లకు ఎదురైన తిమ్మగూడెంవాడు, శర వేగంతో కుంభారమిట్ట పల్లెకు పోయాడు. అతడక్కడికి చేరేసరికి, పల్లెవాసులు కాలి పోయిన తమ గుడిశెలను బావుచేసుకుంటు న్నారు. వాళ్ళల్లో ప్రతిఒక్కడి ముఖం లోనూ కోపం, దైన్యం కనబడుతున్నది.

తిమ్మగూడెంవాడు, కొత్తగా కట్టబడు తున్న ఒక గుడిశెముందాగి, "శబర మాతకూ, జై! నేను తిమ్మగూడెం శబరుణ్ణి. పల్లెపెద్ద శివాలుడి ఇల్లెక్కడ? నవర గండుపోతు మా గూడెం మీదపడి ధాన్యం దోచుకుపోతున్నాడు. మీ పల్లె నుంచి సహాయం కావాలి," అన్నాడు.

అతడి మాటలు వింటూనే, గుడిశెపని చేస్తున్న ఒక మధ్యవయసువాడు, చేతిలో వున్న తాళ్ళనూ, కర్రలనూ కింద పడేసి, "చావుకబురు చల్లగా చెపుతున్నావా, ఏం?





అతడికి దణ్ణంపెట్టి నాలుగైదు మాటల్లో తను వచ్చినపని చెప్పి, తమ గూడెం కేసి శిఖిముఖీ, మరొకయువకుడూ వెళ్ళినట్టు కూడా చెప్పాడు.

తొందరగా పద. రాత్రి ఆ నవరగండుపోతు ముఠావాళ్ళే మా గుడిశెలు తగలబెట్టారు. వాళ్ళ కోసం పల్లెపెద్దకొడుకు శిఖిముఖి అరణ్యమంతా గాలిస్తున్నాడు. గండుపోతు మీ పల్లెలోవున్న సంగతి పల్లెపెద్ద శివాలుడికి వెంటనే తెలియపరచటం మంచిది," అంటూ, గబగబా శివాలుడి ఇంటి కేసి దారితీశాడు. అతడి వెనకగా తిమ్మగూడెం వాడు బయలుదేరాడు.

ఆ ఇద్దరూ శివాలుడి ఇంటిని సమీపించే సరికి, ఇంటిముందున్న పెద్ద మామిడి చెట్టు కింద శివాలుడు కొందరు పల్లె పెద్దలతో మాట్లాడుతున్నాడు. తిమ్మగూడెంవాడు

అంతావిన్న శివాలుడు చప్పున లేచి నిలబడి, "శిఖీ, విక్రమకేసరి తిమ్మగూడె నికి వెళ్ళారన్నమాట. ఇది దుస్సాహసం. ఆ నవరగండుపోతును నే నెరుగుదును. వాడసలే దుష్టుడు. ఇప్పుడు పరమ దుష్టుడైన శిథిలాలయ పూజారితో వాడు నేస్తం కట్టాడు. సరే, వాళ్ళిద్దర్నీ మనం సర్వ నాశనం చేసితీరాలి. పల్లెయువకుల్లో ఓ పాతికమంది మెరికల్లాంటి వాళ్ళను పిలవండి," అన్నాడు.

ఆ వెంటనే పల్లెపెద్దల్లో ఒకడు పక్కనున్న గుడిశెలోకి పరిగెత్తిపోయి, ఒక డప్పు తీసుకుని బయటికి వచ్చి దాన్ని బలంగా మోగించసాగాడు. ఒకటి రెండు నిమిషాలు గడవకముందే, పల్లెలోని యువకులు చాలా మంది యీటెలు పట్టుకుని అక్కడికి పరిగెత్తుకొచ్చారు. శివాలుడు వాళ్ళల్లో ఓ పాతికమందిని వేరుచేసి పక్కగా నిలబెట్టి, "ఇదిగో, యీ తిమ్మగూడెం అతడితో మీరు వెంటనే బయలుదేరిపోండి. దారిలో నవర గండుపోతు ముఠావాళ్ళు ఎదురైనా సరే,

వాళ్ళతో అట్టే జగడం పెట్టుకోక, మీరు సూటిగా తిమ్మగూడేనికే పోవాలి. నేను వెనకగా బయలుదేరివస్తాను," అన్నాడు.

తిమ్మగూడెంవాడు ముందుండి దారి తీయగా శబరయువకులు అతడి వెంట అరణ్యం కేసి పరిగెత్తారు. తరవాత శివాలుడు ఇంట్లోకిపోయి శబరనాయకుడైన వాడు శత్రువుల మీదికి దాడి బయలుదేరే ప్పుడు ధరించవలసిన ఉడుపులూ, అడవి పక్షుల యీకలతోవున్న శిరస్త్రాణం ధరించి బయిటికివచ్చాడు.

ఆసరికి ఇంటి ముందు చాలామంది పల్లె వాసులు చేరారు. శివాలుడు వాళ్ళతో, "నేను తిరిగి వచ్చేవరకూ మీరంతా తగు జాగ్రత్తలో వుండండి. సవరగండుపోతుకు కావలసింది తిండిధాన్యం. శిథిలాలయ పూజారికి అవసరం అయినది నా ఇంట్లో వున్న తాళపత్ర గ్రంథం. నే లేనిసమయంలో వాడు నా ఇంటి మీదికి దాడి రావచ్చు, జాగ్రత్త!" అని హెచ్చరించాడు.

"వాడు అద్భుతశక్తులున్నవాడు. మూడో కన్ను తెరిచి సర్వం భస్మంచేయగలడు," అన్నాడొకడు జనంలోనుంచి.

ఆ మాట్లాడినవాడు జనంలో ఎక్కడున్నాడో తెలుసుకునేందుకు శివాలుడు



తలతిప్పి పరీక్షగాచూసి, వాడు కనబడక పోయేసరికి, పెద్దగా గొంతెత్తి, "మన పల్లె వాసుల్లో కనీసం ఒకళ్ళిద్దరికైనా ఆ పూజారి అద్భుత శక్తుల్లో నమ్మకం కలగటం నా కాశ్చర్యంగా వుంది. పూజారీ, వాడి డబ్బు తిన్న అధములూ లేపే పుకార్లు నమ్మకండి," అన్నాడు.

తరవాత అతడు కొందరు పల్లెవాసుల్ని వెంటబెట్టుకుని తిమ్మగూడెం కేసి బయలు దేరాడు. అరణ్యంలో కొంత నడిచి కొండ ప్రాంతాన్ని చేరగానే, అక్కడ వారికి విరిగి నేలపడివున్న రాకసిబొమ్మ కనిపించింది. శివాలుడి వెంట వున్నవాళ్ళందరూ దాన్ని





చూసి చాలా ఆశ్చర్యపడ్డారు, కొందరికి భయంకూడా కలిగింది.

శబరుల్లో ఒకడు కిందపడివున్న త్రిశూలాన్ని చేతికి తీసుకుని, దాని కంటివున్న రక్తాన్ని పరీక్షగా చూసి, శివాలుడి దగ్గిరకు వచ్చి, "ఈ త్రిశూలం నూటికి నూరుపాళ్లు కంచుది. మన ప్రాంతాల ఎవరూ యీ లోహాన్ని యిందుకు వాడరు. దీన్ని అంటివున్న నెత్తురు మనిషిదికాదు, ఏదో అడవి జంతువుది," అన్నాడు.

శివాలుడు త్రిశూలాన్ని అందుకుని అటూ యిటూ తిప్పి చూసి, "నువ్వన్నది నిజం. వయసులో వుండగా విక్రమకేసరిదొర వెంట హిమాలయ పర్వతప్రాంతాలకు వెళ్ళినప్పుడు, యీ కంచులోహాన్ని అక్కడివాళ్ళు రకరకాల వస్తువులు చేయటానికి ఉపయోగించటం నేను చూశాను," అని, ఓ క్షణకాలం ఏదో ఆలోచిస్తూ వూరుకుని, తరవాత, "సరే, పదండి, కాలయాపన ఎందుకు," అంటూ ముందుకు నడిచాడు.

"ఈ త్రిశూలం శిథిలాలయ పూజారిదేనంటావా, శివాలుదొరా! వాడు హిమాలయ ప్రాంతాల నించి వచ్చినవాడేగదా?" అని ప్రశ్నించాడు, త్రిశూలాన్ని శివాలుడి కిచ్చిన శబరుడు.

"వాడి మాట లెలా నమ్మటం? వెయ్యేళ్ళుగా శిథిలాలయ పూజారిత్వం, మూడో కన్ను, కావాలన్నప్పుడు అదృశ్యమైపోవటం...ఇందులో ఏదో మోసం వుంది. వాణ్ణి చేజిక్కించుకుంటేనేగాని నిజం బయటపడదు. ముందు మనం త్వరగా తిమ్మగూడెం చేరాలి. మనకంటె ముందు పోయినవాళ్ళు, యీసరికి గూడెం చేరి వుంటారనుకుంటాను," అన్నాడు శివాలుడు.

శివాలుడి ఊహ సరైనదే. తమ పల్లె పెద్దకొడుకు ప్రమాదంలో చిక్కుకుని వుండొచ్చని భావించిన శబరయువకులు, తిమ్మగూడెంవాడి వెంట ఆగమేగాల మీద





అ గూడేనికి పరిగెత్తారు. గూడెం పరిసరాలను చేరుతూనే, సహాయం కోసం వచ్చిన ఆ గూడెంవాడు శబరయువకులను సరాసరి గండుపోతు వున్న చోటుకు తీసుకుపోకుండా, పక్కదారుల వెంట వాళ్ళను నడిపి, గండుపోతు ధాన్యం దోచుకుంటున్న ప్రదేశానికి చేర్చాడు.



వాళ్ళు అక్కడికి చేరేంతలో గండుపోతు రంకెలువేస్తూ, శిఖిముఖి మీదికి దూకాడు. శిఖిముఖి యీటె పైకెత్తి ముందు కడుగు వేయబోయేంతలో, గండుపోతు దృష్టి, అప్పుడే అక్కడి కొచ్చిన శబరయువకుల మీద పడింది. వాళ్ళంతా శిఖిముఖి వెనక వైపు నుంచి ఆయుధాలెత్తి ముందుకు ఉరకబోతున్నారు.

గండుపోతు వాళ్ళను చూస్తూనే తక్కున ఆగిపోయి పెద్ద గొంతుతో, "మోసం! కపటం! పోటాపోటీకి రమ్మని పిలిచి, నీ వాళ్ళను నా మీదికి దొంగదాడికి ఉసికొల్పుతున్నావా?" అంటూ చూపుడు వేలును శబరయువకుల కేసి ఎత్తాడు.

శిఖిముఖీ, అతడికి అంతదూరంలో నిలబడివున్న విక్రమకేసరీ ఆశ్చర్యంగా వెనక్కుతిరిగి చూశారు. వాళ్ళకు కొండల దగ్గిర తమకు కనిపించిన తిమ్మగూడెం వాడి వెంట వచ్చిన శబరయువకులు ఈటెలు పట్టుకుని ముందుకు వస్తూండటం కనిపించింది. శిఖిముఖి వెంటనే చేయెత్తి వాళ్ళకు ముందుకు రావద్దని సౌంజ్ఞచేసి, "మీరంతా వున్నచోటునే ఆగండి. ఈ సవర గండుపోతూ, నేనూ మా బలాబలాలు తేల్చుకోపోతున్నాం," అన్నాడు.

శబరయువకులు ఆ మాట వింటూనే ఎక్కడివాళ్ళక్కడ నిలబడిపోయారు. శిఖిముఖి, గండుపోతు కేసి తిరిగి, "ఊఁ, దెబ్బ కాచుకో, గండుపోతూ!" అని అరిచి ముందుకు అడుగు వేయబోయాడు. కాని, అంతలో గండుపోతు ఒకడుగు వెనక్కు





వేసి, "నువ్వు నీవాళ్ళ నందర్నీ వీపు వెనక వత్తాసు పెట్టుకుని నా మీదికి దెబ్బలాడ వస్తున్నావు.. ఒకవేళ... ఒకవేళ ఏవింటి? నువ్వు నా చేతిలో తప్పక చచ్చితీరుతావు— కాని, ఆ సమయంలో నీ శబరమంద అంతా ఒంటరిగావున్న నా మీదికి వచ్చి పడతారు," అన్నాడు.

"ఎవరిచేతిలో ఎవరు చచ్చేదీ యిప్పుడే తేలిపోతుంది, గప్పాలు కొట్టకు. కావాలంటే నీవాళ్ళను కూడా నువ్వు నీ వెనక రక్షణ కోసం తెచ్చుకో," అన్నాడు శిఖిముఖి.

ఆ వెంటనే గండుపోతు చప్పట్లుచరిచి కేకలు పెట్టాడు. గూడెంలో ఎక్కడెక్కడ



వున్న అతడి అనుచరులంతా తమ నాయకుడి దగ్గిరకు పరిగెత్తుకు వచ్చారు. గండుపోతు వాళ్ళందర్నీ పడ్లపాతరకు అవతలి వైపున ఆయుధాలతో సర్వసన్నద్ధంగా వుండమనీ, శిఖిముఖి ముఠావాళ్ళు వున్నచోటు నుంచి కాలు కదిపితేచాలు, వాళ్ళ మీదికి ఉరకమనీ అజ్ఞలు యిచ్చాడు.

ఆ తరవాత శిఖిముఖీ, గండుపోతూ యీటెలను ఝళిపిస్తూ కలియబడ్డారు. గండుపోతు ఈటె విసుర్లను శిఖిముఖి తన ఈటెను అడ్డంగాపెట్టి ఆపుతూ, ఒక్కొక్క అడుగే వెనక్కు వేస్తూ, ధాన్యం పాతర చుట్టూ గిరికీలు తిరగసాగాడు. అతడి ఎత్తుగడ ఏమిటంటే; గండుపోతు మీద తను ఆఖరి దెబ్బ తీసేముందు అతణ్ణి బాగా అలిసిపోయేట్టు చేయాలని.

గండుపోతుకు, శిఖిముఖి తనను పాతర చుట్టూ తిప్పటం చిర్రెత్తిస్తున్నది. ఈ కుర్ర కుంకను క్షణాలమీద యీటెతో నాలుగు పోట్లు పొడిచి పాతర్లో పడవేసి యింత మట్టి కప్పించగలనని, అతడనుకున్నాడు. కాని, ఆ కుంక చిడతగండులా తన యీటె దెబ్బకు అందకుండా తప్పుకుంటూ, తనతో దాగుడుమూతలాట లాటి దేదో ఆడుతున్నాడు....

"ఒరే, పిరికికుట్టే! అంత భయపడి పారిపోదలిచిన వాడివి నాతో ఎందుకు పంతానికి దిగావు?" అంటూ పళ్ళుకొరికి, ఆయాసపడసాగాడు గండుపోతు.

"పోతూ! నేను పారిపోవటంలేదు, నీ ప్రాణం తీయబోతున్నాను!" అంటూ శిఖిముఖి ఒక్క కేకపెట్టి, తన యీటెను రెండు గుప్పెళ్ళలోనూ గట్టిగా బిగించి పట్టుకుని, గండుపోతు చేతిలోని ఈటెను బలంగా కొట్టాడు. ఆ దెబ్బకు గండుపోతు పట్టుకున్న ఈటె పట్టుదప్పి ఎగిరి అంత దూరాన పడిపోయింది. అతడు దాని కోసం పక్కకు తిరిగి పరిగెత్తబోయేంతలో శిఖిముఖి అతడి భుజంమీద తన ఈటె అలుగును బలంగా ఆనించి, "పోతూ! శరణను, ఓడిపోయాననను, నిన్ను ప్రాణాలతో వదులుతాను," అన్నాడు.

"గండుపోతు శబరకుక్కను శరణడగటమా?" అంటూ గండుపోతు భీకరంగా అరిచి ఎడంచేత్తో, భుజంమీద ఆనించివున్న శిఖిముఖి యీటెను పక్కకు కొట్టి, కుడిచేత్తో మొలనున్న పొట్టి కత్తిని చర్రున లాగి మీదికి దూకాడు. శిఖిముఖి చప్పున ఒకడుగు వెనక్కువేసి, అతడి కత్తి దెబ్బను తప్పుకుని, తిరిగి గండుపోతు మీదికి రాబోయేంతలో ఈటెతో అతడి కుడి చేతిని



బలంగా ఒక పోటు పొడిచి, అదేసమయంలో కాలితో అతడి ఎడమ మోకాలి మీద గట్టిగా ఒక తన్ను తన్నాడు.

గండుపోతు బాధతో ఒక అరుపు అరిచాడు. అతడి చేతిలోని కత్తి జారి కింద పడింది. మోకాలి మీద తగిలిన తాపుకు కాలిపట్టు తప్పి అతడు పక్కనున్న పడ్ల పాతర్లో దభీమంటూ పడిపోయాడు.

ఇది చూస్తూనే అతడి అనుచరుల్లో హాహాకారాలు బయలుదేరినై. వాళ్ళల్లో కొందరు పారిపోయేందుకు వెనుదిరగబోయేంతలో, ఒక సవరుడు ఎడమచేత్తో ఈటె పైకెత్తి, కుడిచేత్తో జబ్బచరుస్తూ, "గండుపోతుదొర తరవాత నేనూ, యిక్కడ నాయకుణ్ణి! ఈ శిఖిముఖినీ, వాడి కులంవాళ్ళనూ కన్నుమూసి తెరిచేంతలో నరికి పోగులుపెడతాను. మీరు నా వెన్ను కాచి వుండండి, చాలు, రండి," అంటూ శిఖిముఖి కేసి బయలుదేరాడు.

శిఖిముఖికి ప్రమాదం రానున్నదని గ్రహించిన విక్రమకేసరి, శబరయువకులందర్నీ హెచ్చరించి శత్రువులను ఎదుర్కొనేందుకు బయలుదేరాడు. అటు సవరలు కొత్త నాయకుడి వెంట ముందుకు రాసాగారు. భయంకరమైన పోరూ, రక్తపాతం తప్పని పరిస్థితి ఏర్పడిన ఆ దశలో సవరల వెనక నుంచి శివాలుడు ఎలుగెత్తి కేక పెట్టాడు: "అనవసర రక్తపాతం ఎందుకు? గండుపోతు ముఠావాళ్ళంతా లొంగిపొండి! ఆయుధాలు కింద పడవేయండి."

ఆ కేక వింటూనే గండుపోతు అనుచరులు వెనక్కు తిరిగి చూశారు. శివాలుడూ మరి కొందరు శబరులూ ఈటెలు ఎత్తి తమ కేసి రావటం వాళ్ళ కంటబడింది. ముందువైపు నుంచి విక్రమకేసరి శబర యువకుల్తో మీదికి వస్తున్నాడు. ఇప్పుడేం చేయటం? లొంగిపోవటమా? లేక నిలబడి ఎదిరించటమా? —(ఇంకా వుంది)






# నియమభంగం

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టు పై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవం లోని బేతాళుడు, "రాజా, నీ నిష్ఠ అమోఘ మైనది. అది సోమశేఖరుడి నియమంలాగే కొనసాగి సంతకాలం కొనసాగి, చివరకు లభించిన వరం కాస్తా చెయిజారిపోతుం దేమో, జాగ్రత్త. శ్రమతెలియకుండా ఉండ గలందులకు నీకు సోమశేఖరుడి కథ చెబుతాను, విను," అంటూ ఈ విధంగా చెప్పసాగాడు:

సోమశేఖరు డనే బ్రాహ్మణుడు గంగా తీరాన ఆశ్రమం కల్పించుకుని నివసిస్తూ ఉండేవాడు. ఆయన కొక నియమం ఉండేది. ఆయన రోజూ భిక్షాటన చేసి, తనకు దొరికిన దానిలో అతిథి, అభ్యాగతు లకుపెట్టి, ఏమైనా మిగిలితే తాను తినే

## బేతాళ కథలు




వాడు, లేకపోతే గంగాజలం తాగి తృప్తిపడేవాడు. ఇంకేమి చేసినా చేయకపోయినా సోమశేఖరుడు ఈ నియమాన్ని ఏమాత్రమూ తప్పకుండా అనుష్ఠించేవాడు.

ఇలా ఉండగా ఒకసారి ఆ ప్రాంతానికి కరువు దాపరించింది. సోమశేఖరుడికి దొరికే భిక్ష తరిగింది, అతనికి తారసిల్లే అతిథి అభ్యాగతుల సంఖ్య పెరిగింది. అయినా ఆయన నియమం తప్పక తాను సంపాదించిన భిక్షాన్నాన్ని అభ్యాగతులకు పెడుతూనే ఉన్నాడు.

ఈ కరువు సమయంలోనే ఒకనాడు సోమశేఖరుడు భిక్షాటన కోసం తన ఆశ్రమం దాటి నాలుగడుగులు వేసేసరికి, ఆయన కెదురుగా వచ్చే ఒక మనిషి శోషవచ్చి పడిపోయాడు. సోమశేఖరుడా మనిషిని తన ఆశ్రమంలోకి తీసుకుపోయి, శైత్యోపచారాలు చేసి, తాగటానికి మంచి నీరిచ్చి, "ఎవరు నువు? ఎరదు కలా పడిపోయావు?" అని అడిగాడు.

"నేను తిండి తిని ఎన్నాళ్ళయిందో జ్ఞాపకంలేదు. కరువుకాలం. తిండి కోసం వెతుకుతూ దిక్కు తెలియకుండా పడి వస్తున్నాను," అన్నాడా మనిషి.

"నువు ఇక్కడే విశ్రాంతి తీసుకో, నేను భిక్షాటన చేసి వచ్చి నీకు ఆహారం పెడతాను," అని సోమశేఖరుడు వెళ్ళిపోయాడు. అదేం చిత్రమో, ఆనాడు ఆయనకు అపరాహ్ణం లోపల ఒక్క గింజకూడా దొరకలేదు. అవతల అభ్యాగతుడు భోజనం కోసం కనిపెట్టుకుని ఉన్నాడు. భోజనం పెడతానని అతనికి తాను మాట ఇచ్చి ఉన్నాడు. ఆ మాట తప్పటంకన్న ఆత్మహత్య చేసుకోవటం సోమశేఖరుడికి మేలని తోచింది. అందుచేత ఆయన వెళ్ళి గంగలో దూకేశాడు.

అలా దూకి నదిలో మునిగిన సోమశేఖరుడు చావలేదు. అతని ఎదట ఒక స్త్రీ

ఆకారం అస్పష్టంగా కనిపించి, "నేను గంగను. నువ్వు ఎందుకని ఆత్మహత్యకు పాల్పడ్డావు? నీకు వచ్చిన కష్టమేమిటి?" అని అడిగింది.

సోమశేఖరుడు చేతులు జోడించి, "తల్లీ, నేను భిక్షాటన చేసి, నాకు భోజనం ఉన్నా లేకపోయినా, అతిథి అభ్యాగతులకు ఇంత భోజనం పెట్టటం నియమంగా పెట్టుకున్నాను. నా ఇంట అభ్యాగతి భోజనం కోసం వేచి ఉన్నాడు. నా కివాళ ఒక్క గింజ కూడా దొరకలేదు. నియమభంగం కన్న ఆత్మహత్య మేలనుకున్నాను," అని చెప్పాడు.

"నాయనా, విచారించకు. ఈ పాత్ర తీసుకుపోయి నీ అభ్యాగతికి భోజనం పెట్టు. ఇది అక్షయపాత్ర. దీనితో నువ్వు ఎంతమంది అతిథి అభ్యాగతులకైనా భోజనం పెట్టవచ్చు. నీకు మాత్రం ఇది ఉపయోగపడదు. ఎప్పటిలాగే నువ్వు భిక్షాటన చేసే పొట్టపోసుకోవలిసి ఉంటుంది. నీకు భోజనం ఉన్నా, లేకపోయినా నీ నియమాన్ని మాత్రం ఈ పాత్ర రక్షిస్తుంది," అని చెప్పి గంగాదేవి, సోమశేఖరుడి కొక పాత్ర ఇచ్చి, అంతర్ధానమయింది.

సోమశేఖరుడు అమితానందం చెంది, ఆ పాత్రతో తన ఆశ్రమానికి తిరిగి వచ్చి,





తన అభ్యాగతి ముందు పాత్రను బోర్లిం చాడు. ఆ పాత్ర అభ్యాగతికి షడ్రసోపేత మైన భోజనం ప్రసాదించింది. ఎంతోకాలంగా ఉపోషాలు చేస్తున్న ఆ మనిషి కడుపారా భోజనం చేసి, తన దారిన తాను వెళ్ళాడు.

గంగాదేవి ప్రసాదించిన పాత్రను సోమ శేఖరుడు తన ముందు కూడా బోర్లించు కున్నాడు, కాని అందులో నుంచి ఏమీ రాలేదు. అందుచేత ఆయన అక్షయపాత్ర ఉండి కూడా ఆ రోజు పస్తుండవలసి వచ్చింది.

అయినా సోమశేఖరుడు విచారించలేదు. ఆయన రోజూ తనకు కావలసినంత వరకే భిక్షాటన చేసి, ఎంతమంది అతిథులు తన దగ్గరకు వచ్చినా నిశ్చింతగా అందరికీ అన్నదానం చేస్తున్నాడు. అతని కీర్తి దశ దిశలా వ్యాపించింది.

సోమశేఖరుడి అన్నదాన వ్రతం గురించి విని ఆ దేశపు రాజు ఆయనను చూడ వచ్చాడు. అక్షయపాత్ర మహిమ కళ్ళారా చూశాడు. అది సోమశేఖరుడి చేతిలో ఉంటేనే తప్ప మరొకడి చేతిలో ఉంటే ఏమీ ఇవ్వదనీ, అప్పుడు కూడా సోమశేఖ రుడికి ఏమీ ఇవ్వదనీ రాజు తెలుసుకున్నాడు.

రాజు సోమశేఖరుడితో, "ఎంతమంది కైనా అన్నదానం చేయగలవాడివై ఉండి కూడా, నీ పొట్ట నింపుకోవటానికి భిక్షాటన చేయవలిసి రావటం ఏమీ బాగాలేదు. రేపటి నుండీ నీకు రాజభవనం నుంచి రాజోచిత మైన భోజనం పంపుతాను," అని చెప్పి అలాగే చేశాడు.

ఇప్పుడు సోమశేఖరుడు భిక్షాటనకు పోవటం లేదు. అతిథులకు పెట్టటానికి అక్షయపాత్ర ఉన్నది. ఆయనకు దివ్యమైన భోజనం వేళతప్పకుండా రాజభవనం నుంచి వస్తున్నది..

ఇలా కొంతకాలం జరిగేసరికి సోమశేఖ రుడిలో మార్పు వచ్చింది. అతిథులకు

అన్నం పెట్టడం పట్ల ఆయనకు శ్రద్ధ క్రమంగా తగ్గింది. వారిలో చాలామంది నిజమైన అన్నార్తులు కారనీ, తేరగా తినటానికి వస్తున్నవాళ్ళనీ ఆయనకు తోచింది. తాను భోజనం చేసినాక ఎవరైనా భోజనం పెట్టమని వస్తే ఆయనకు చిరాకు వేసేది. అదివరకు దేవతాస్వరూపులుగా కనిపించిన అతిథి అభ్యాగతులు అయన కిప్పుడు ముష్టివాళ్ళ లాగా కనపడసాగారు. ఆయన వాళ్లతో పరుషంగా మాట్లాడేవాడు. "వచ్చే వాళ్ళు ఒకవేళకు వస్తే బాగుండును! నా ఆశ్రమం ధర్మసత్రం అని మీ ఉద్దేశం!" అని వాళ్ళ మీద విసుక్కునేవాడు.

క్రమంగా అతిథుల సంఖ్య తగ్గుతూ వచ్చింది. వాళ్ళ సంఖ్య తగ్గుతూ వచ్చిన కొద్దీ సోమశేఖరుడి చిరాకు హెచ్చుతూ రాసాగింది. చివరకు ఆయన ఆశ్రమానికి అతిథి అభ్యాగతులు రావటం మానేశారు. ఆయనను గురించి లోకులు చాలా చెడ్డగా కూడా చెప్పుకోసాగారు.

ఇది కూడా రాజుగారి దాకా వెళ్ళింది. రాజు ఆశ్చర్యపడ్డాడు. ఆ బ్రాహ్మణుడి దగ్గిర గంగాదేవి ఇచ్చిన అక్షయపాత్ర ఉన్నది; ఆయన శ్రమపడి భిక్షాటన చెయ్యకుండా తాను భోజనం పంపుతున్నాడు;




అటువంటప్పు డా బ్రాహ్మణుడు అతిథి అభ్యాగతులకు అసంతృప్తి కలిగించ నవసర మేమున్నదో రాజుకు అర్థం కాలేదు. ఈ రహస్య మేమిటో స్వయంగా తెలుసుకుందామని రాజు బయలుదేరాడు.

రాజుగారు వస్తున్న వార్త ముందుగానే బ్రాహ్మణుడికి అందింది. ఆయన అక్షయపాత్ర గురించి తప్పక అడుగుతాడు. కాని సోమశేఖరుడు దాన్ని ఉపయోగించి చాలా కాల మయింది. తీసి చూస్తే అది మట్టికొట్టుకుని ఉన్నట్టు కనిపించింది. దాన్ని తోమి శుభ్రం చేతామని ఆయన నది-దగ్గిరికి తీసుకుపోయి, నీటిలో ముంచాడు. ఎవరో

లాగేసినట్టుగా అక్షయపాత్ర నీటిలోకి వెళ్ళి పోయింది. ఎంత వెతికినా కనిపించలేదు.

బేతాళు డీ కథ చెప్పి, "రాజా, నా కొక సందేహం. తనకు పొట్టగడవని రోజులలో కూడా అన్నదానవ్రతం అవలంబించిన సోమశేఖరుడు అక్షయపాత్ర ఉండీ, తనకు భిక్షాటన కూడా తప్పినాక అతిథిఅభ్యాగతుల పట్ల ఎందుకు అశ్రద్ధ వహించాడు? తన వ్రతం కొనసాగించటానికి అవి ఎంతో అనుకూలమైన పరిస్థితులు గదా? ఈ సందేహానికి సమాధానం తెలిసి కూడా చెప్పక పోయావో నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "ఆకలితో బాధ పడేవాడే మరొకరి ఆకలిని గౌరవించ గలుగుతాడు. భిక్షాటన చేసిన రోజులలో సోమశేఖరుడు ఇతరుల ఆకలి తీర్చిన తర వాతనే తన ఆకలి తీర్చుకునేవాడు. అప్పుడు అభ్యాగతులు ఆయనతో సమానులుగా ఉండేవారు. అక్షయపాత్ర లభించినాక కూడా ఆయనకు ఆకలి అంటే ఏమిటో తెలుసును. ఎందుకంటే, భిక్షాటన చేస్తే తప్ప ఆ ఆకలి తీరేది కాదు. కాని రాజు గారు తన భుక్తికి మంచి ఏర్పాటు చేసినాక ఆయనకు ఆకలి పట్ల అగౌరవం ఏర్పడింది. అన్నార్తుల పైన కూడా అగౌరవం ఏర్ప డింది. ఇప్పుడు అతిథి అభ్యాగతులు తన కన్న హీనులు. తన కన్న హీనులైనవారికి సేవ చేయవలసి వచ్చేసరికి సోమశేఖరుడికి చిరాకూ, కోపమూ పుట్టుకొచ్చాయి. ఆయన తన అతిథులను అగౌరవించ సాగాడు. వాళ్ళు కూడా రావటం మానుకున్నారు. ఈ కారణం చేత అక్షయపాత్రా, రాజుగారు సోమశేఖరుడి కోసం చేసిన భోజనం ఏర్పాటూ ఆయన వ్రతానికి అనుకూలించక పోగా ప్రతికూలించటం జరిగింది," అన్నాడు.

రాజు కీ విధంగా మౌనభంగం కలగ గానే బేతాళుడు శవంతో సహా మాయమై మళ్ళీ చెట్టెక్కాడు. (కల్పితం)






# ఇంద్రజాలం

సుందరగఢ్ అరణ్యంలో రమణకు డనే నక్క ఉండేది. సాధారణంగా నక్కలు తెలివిగలవి. రమణకుడికి తెలివితోబాటు వయసూ, వయసుతోబాటు అనుభవమూ కూడా ఉండేది. అరణ్యంలోని మిగతా జంతువులు రమణకుడి పట్ల ఎంతో అభిమానంగా ఉంటూ, అవసరమైనప్పుడల్లా దాని సలహాను తీసుకుంటూ ఉండేవి. అరణ్యవాసులకు జీవితం ఆనందకరంగా సాగిపోతూ ఉన్నది.

ఇంతలో ఒకనాడు సింహగర్జనతో అరణ్యమంతా దద్దరిల్లి పోయింది. ఇక తమకు శాంతి సౌఖ్యాలు కరువవుతాయని జంతువులు గ్రహించాయి.

అవి భయపడ్డంతా జరిగింది. మర్నాడు ఉదయానికల్లా రెండు దుప్పులకూ, ఒక అడవి దున్నకూ కాలం తీరిపోయింది. ఆ మధ్యాహ్నం కుందేలు దంపతులు చనిపోయాయి. ఆ సాయంకాలం మానుపిల్లికి వెంట్రుక వాసిలో చావు తప్పింది. ఒక వారం రోజులపాటు హత్యాకాండ అవిచ్ఛిన్నంగా సాగింది.

ఈ అరణ్యంలోకి కొత్తగా వచ్చిన పరాక్రము డనే సింహం తాను మృగరాజునని ప్రకటించుకున్నది. అది సాగించే హత్యాకాండకు అర్థమేమీ లేదు. ఈ హత్యాకాండను ఎలాగైనా అరికట్టాలని నిశ్చయించుకుని, అరణ్యమృగాలు రమణకుడి వద్దకు వెళ్ళాయి. వెళ్ళి, "తాతా, ఈ మృగరాజు క్రౌర్యం నుంచి మమ్మల్ని కాపాడు," అని మొర పెట్టుకున్నాయి.

"తొందర పడకండి. కొంచెం ఆలోచించనివ్వండి," అన్నది నక్క.

"ఆలోచిస్తూ కూర్చునే వ్యవధి లేదు. చూస్తూండగానే అందరమూ చచ్చిపోతాం," అన్నాయి మృగాలు.

ఏ. సి. సర్కార్, ఇంద్రజాలికుడు





నక్క దీర్ఘంగా ఆలోచించి, చివరకు చిన్నగా నవ్వి, "సరేనర్రా, నా కొక ఆలోచన తట్టింది. కాని దాన్ని ఆచరణలో పెట్టాలంటే ఎవరో ఒకరు వెళ్ళి పరాక్రముణ్ణి కలవాలి. మీలో ఎవరు అందుకు సిద్ధంగా ఉన్నారు?" అన్నది. ఒక్క జంతువు కూడా జవాబు చెప్ప లేదు.

"సరే, కానివ్వండి. నే నే పోతాను. ఇంతకూ, ఘనతవహించిన మన మహారాజు గారి మకాం ఎక్కడ?" అన్నది నక్క.

మానుపిల్లి తన తోకను నిటారుగా ఎత్తి, "గబ్బిలాల మర్రి సమీపంగా అరటితోపు పక్కన గుహ లేదూ, అందులో!" అన్నది.

నక్క అందరినీ పంపేసి, చీకటి పడే వేళ కడుపునిండా తిని, తన గుహ నుంచి బయలుదేరింది. అది మర్రిచెట్టు దాకా పరిగెత్తింది. అటుతరవాత అడుగులో అడుగు వేసుకుంటూ, ముందుకు సాగింది.

గుహలో నుంచి గురక విన వస్తున్నది. మృగరాజు నిద్రపోతున్నాడు. గుహ ముందు అనేక కళేబరాలూ, అస్థిపంజరాలూ చెల్లా చెదరుగా పడి ఉన్నాయి. అందులో చాలా భాగం రమణకుడి మిత్రులవే? ఏమి చెయ్యాలో నిశ్చయించు కోకుండానే నక్క తన గుహకు తిరిగి వచ్చింది.

ఆ రాత్రల్లా దానికి నిద్ర లేదు. అది ఆలోచనలతో కన్ను మూయలేదు. తెల్లవారు ఝామున మలయమారుతం వీచే వేళ దాని బుర్రలోకి ఒక ఆలోచన వచ్చింది. అది చివాల్న లేచి అరటితోపు కేసి వేగంగా వెళ్ళిపోయింది.

మళ్ళీ సాయంకాల మయేసరికి మృగాలన్నీ నక్క వద్దకు వచ్చాయి. నక్క మంచి ఉత్సాహంలో ఉండటం అవి గమనించాయి. "స్నేహితులారా, రేపటి నుంచీ మీకు ఏ భయమూ ఉండదు. మహారాజుగారి మీద చిన్న ఇంద్రజాలం ప్రయోగించి, వారిని పరమపదానికి పంపించేస్తాను. రేపు



ఉదయం మీరంతా ఇక్కడికి రండి," అని చెప్పి నక్క వారిని పంపేసింది.

మర్నాడు ఉదయం జంతువులన్నీ వచ్చాక నక్క ఖడ్గమృగం కేసి తిరిగి, "తమ్ముడూ, నువు చాలా ముఖ్యపాత్ర వహించాలి సుమా!" అన్నది. ఖడ్గమృగం సమ్మతి సూచకంగా తల ఆడించింది.

మృగాలన్నీ వచ్చేసరికి సింహానికి నిద్రా భంగమయింది.

"సింహ పరాక్రమా! మహారాజా! తమకు అభివాదం తెల్పటానికి అరణ్య వాసుల మంతా బయలుదేరి వచ్చాం," అన్నది ఖడ్గమృగం.

"ఇంతకాలం ఏం చేస్తున్నారు? ఎప్పుడో వచ్చి ఉండవలిసింది," అన్నది సింహం.

నక్క ముందుకు వచ్చి, "ఏం చెప్పను, మహారాజా. మీ కన్న కూడా మహా శక్తి మంతుడైన ద్విపాద మృగం ఒకటి మమ్మల్ని తమ వద్దకు రానివ్వకుండా ఆటంక పరిచింది. అయినా ఇవాళ సాహ సించి వచ్చేశాం. ఎందుకంటే ఆ రెండు కాళ్ళవాడు ఇంద్రజాలంతో తమ ప్రాణాలు తీస్తానంటున్నాడు. వాడు తన ఇంద్ర జాలంతో ఇక్కడి అరటికాయల నన్నిటినీ రెండుగా చీల్చాడట. తమర్ని కూడా అలాగే



ఇంద్రజాలంతో రెండుగా చీల్చేస్తాడట! తమర్ని హెచ్చరించ వచ్చాం!" అన్నది.

సింహం పెద్దగా నవ్వి, "పిచ్చి మాటలు! ఇంద్రజాలంతో నరకటమేమిటి? చూడండి, అరటితోపులో రెండు చెట్లకు గెలలున్నాయి. ఒక్క కాయ కూడా చీల లేదు," అన్నది.

"ఆ మనిషి ఉద్దండుడు. అయినా చూద్దాం!" అంటూ కోతి వెళ్ళి క్షణంలో అరటికాయలు తెంపుకు వచ్చింది. సింహం ఒక కాయ తోలు వొలిచింది. లోపలి కాయ రెండుగా చీల్చి ఉన్నది! ఇంకో కాయ—ఇంకో కాయ—అన్నీ బయటికి మామూలుగానే ఉన్నాయి, కాని లోపల

రెండుగా చీలి ఉన్నాయి. నక్క చెప్పిన ఇంద్రజాలం నిజమే!

సింహం మొహం చిన్నబోయింది; "ఆ రెండు కాళ్ళవాడెక్కడ? వాణ్ణి వెంటనే అంతం చెయ్యాలి!" అన్నది.

"భయపడకండి, మహారాజా! రెండు కాళ్ళవాడు మిమ్మల్ని ఏం చెయ్యగలడు?" అన్నది నక్క, సింహాన్ని మరింత భయ పెట్టడానికి.

"వాడు నన్ను రెండుగా చీల్చిన దాకా చూస్తూ కూచోమనా నీ సలహా?" అన్నది సింహం కోపంగా.

నక్క తన చంకలో నుంచి ఎర్రని అంజనం గల డబ్బా తీసి, "మహారాజా, ఇది దివ్యదృష్టి అంజనం. ఆ రెండుకాళ్ళ వాడు దీన్ని కళ్ళకు పూసుకుని ఎక్కడ ఏమి ఉన్నదీ చూస్తాడు. వాడికి తెలియ కుండా దీన్ని దొంగిలించి తెచ్చాను. మీరు కూడా దీన్ని కళ్ళకు రాచుకుని, వాడెక్కడ ఉన్నాడో చూడండి," అంటూ అంజనం డబ్బీ అందించింది.

సింహం ఆ అంజనాన్ని కళ్ళలో పెట్టుకో గానే దాని కళ్ళు రెండూ పోయాయి. మరు క్షణమే ఖడ్గమృగం సింహాన్ని తన కొమ్ముతో దాని గుండెల్లో పొడిచింది. అన్ని జంతువులూ సింహం పైన పడి, దాన్ని యమలోకానికి పంపేశాయి.

తరవాత జంతువులు నక్కను, "తాతా, అంతా బాగానే ఉంది గాని, ఆ అరటి కాయలు ఏ ఇంద్రజాలంతో చీలాయి?" అని అడిగాయి.

"ఏమున్నదర్రా? అరటికాయలోకి ఒక సూది గుచ్చి, దాన్ని ఒక పక్క నుంచి ఇంకొక పక్కకి ఆడిస్తే సరి. పై తొక్కలో సూది గుచ్చిన బెజ్జం మాత్రమే ఉంటుంది గాని, లోపలి గుజ్జు రెండుగా చీలిపోతుంది. చిన్న పిల్లలు కూడా ఈ ఇంద్రజాలం చెయ్యవచ్చు," అన్నది నక్క.






# సరిఅయినతీర్పు

పూర్వం గౌతమీతీరాన ధనగుప్త డనే కటిక పేదవాడుండేవాడు. తన పేరు బొత్తిగా నిరర్థకమయినందుకు అతను ఎంతో బాధ పడేవాడు. ధనం సంపాదించటానికి అతను చేసిన ప్రయత్నం ఒక్కటీ ఫలించలేదు. చివరకు అతను జీవితం మీద విరక్తిచెంది, ఈ జన్మకిక ఇంతే అనుకుని, ఒకనాడు నదిలోకి దూకేశాడు.

ఆ సమయానికి అటుగా పోతున్న గోసాయి ఒకడు ధనగుప్తుణ్ణి నది నుంచి బయటికి లాగి కాపాడి, "ఎందుకు చావా లనుకున్నావు?" అని అడిగాడు.

ధనగుప్తుడు తన సంగతంతా చెప్పాడు. గోసాయి అతనికి ఒక తాయెత్తు ఇచ్చి, "దీన్ని కట్టుకున్నావంటే నీకు అదృష్టం కలిసివస్తుంది. త్వరలోనే ధనవంతుడి వవుతావు," అని చెప్పి తన దారిన తాను వెళ్ళిపోయాడు.

గోసాయి యిచ్చిన తాయెత్తు ప్రభావమో, లేక ధనగుప్తుడిలో కలిగిన ఆత్మవిశ్వాసమో గాని, అదిమొదలు అతను చేసిన ప్రతి పనీ కలిసి వచ్చింది. అతను పట్టినది బంగారమయింది. కొద్దికాలంలోనే అతను గ్రామంలోని ధనవంతులలో ఒకడై, ఒక చక్కని కన్యను కూడా పెళ్ళాడి, కాల క్రమాన ఒక కొడుకును కన్నాడు.

క్రమంగా అతను భారీఎత్తున వ్యాపారం ప్రారంభించి అంతులేని పొలాలూ, గొడ్లూ, ఇళ్ళూ, వస్తువాహనాలూ సంపాదించాడు. అతని వ్యవహారాలన్నీ సక్రమంగా నడిచేలా చూడటానికి ఒక దివానును కూడా ఏర్పాటు చేసుకున్నాడు.

కొంతకాలం గడిచాక ధనగుప్తుడి భార్య మరణించింది. తరవాత ధనగుప్తుడు కూడా మంచానపడ్డాడు. తనకు చావు దగ్గిరపడిం దనీ, పసివాడైన కొడుక్కు ఇక దిక్కెవ్వరూ

జె. అనసూయాదేవి





షించాడు. తన యజమానికి మరణకాల మందు మతి పూర్తిగా పోయిఉంటుందని ఆయన అనుకున్నాడు.

వాజ్మూలం రాయించిన అనంతరం ధన గుప్తుడు కన్నుమూశాడు.

ధనగుప్తుడి కొడుక్కు యుక్తవయసు వచ్చినదాకా దివాను ఆ కుర్రవాడికి ఏలోటూ రాకుండా చూశాడు.

ధనగుప్తుడి కొడుకు యుక్తవయస్కుడు కాగానే తన ఆస్తిని తనకు స్వాధీనం చెయ్యమని దివానును అడిగాడు.

దివాను అతనికి ఒక తాయెత్తు ఇచ్చి, "దీనితోనే మీ తండ్రిగారు ఇంత ఐశ్వర్యమూ సంపాదించుకున్నారు. మీ తండ్రిగారి ఆస్తి నుంచి దీనిని నువు తీసుకో. మిగిలినదంతా నాదే," అన్నాడు.

ధనగుప్తుడి కొడుకు నిర్ఘాంతపోయి, "ఇదేమి అన్యాయం? నా తండ్రి ఆస్తి అంతా మీరు తీసుకోవట మేమిటి?" అని అడిగాడు.

"తన ఆస్తిలో నుంచి నా కిష్టమైనంత నేను పుచ్చుకునేటందుకు అనుకూలంగా మీ తండ్రిగారు వాజ్మూలం తయారు చేశారు. కావలిస్తే ఆ వాజ్మూలం చదివి చూసుకో వచ్చు," అన్నాడు దివాను.

ఉండరనీ తేచి, అతను నలుగురు పెద్ద లనూ పిలిచి, వారి సమక్షంలోనే మరణ వాజ్మూలం రాయించాడు. ఆయన అందులో ఇలా ఏర్పాటు చేశాడు:

"నేను మరణించిన అనంతరము మా దివాను నా యావదాస్తికీ రక్షకుడుగా ఉండి, నా కుమారుని అవసరములన్నీ చూడవలెను. నా కుమారుడు యుక్తవయస్కుడయిన పిదప దివానుగారు నా ఆస్తిలో తనకు ఇష్టమైనంత నా కుమారున కిచ్చి, మిగిలినది తాను ఉంచుకోవలెను."

ఈ వాజ్మూలం చూసి పెద్దలంతా నిర్ఘాంతపోయారు. దివాను చాలా సంతో



ధనగుప్తుడి కొడుకు తన తండ్రి వాజ్మూలం తీసుకుని న్యాయాధికారి వద్దకు వెళ్ళి, "ఈ వాజ్మూలం అడ్డం పెట్టుకుని మా దివాను మా తండ్రి ఆస్తి యావత్తూ కాజేస్తానంటున్నాడు," అన్నాడు.

న్యాయాధికారి వాజ్మూలాన్ని శ్రద్ధగా చదివి దివానును పిలిపించి, "ఏమయ్యా, ఈ కుర్రవాడు యుక్తవయస్కుడయాడు. తన తండ్రి ఆస్తి తన కిప్పించమంటున్నాడు. నా దాకా రాకుండా నువే ఇచ్చెయ్యలేకపోయావా?" అని అడిగాడు.

"చిత్తం, నేను ఇవ్వననలేదండి. మా యజమానికి ఇంత ఐశ్వర్యమూ సంపాదించిపెట్టిన తాయెత్తు అతన్ని తీసుకోమన్నానండి. మిగిలిన ఆస్తి అంతా నేనే ఉంచుకుంటున్నానండి. నా యిష్టం వచ్చినంత నేను ఉంచుకోవచ్చునని మా యజమాని వాజ్మూలంలో స్పష్టంగా ఉందండి," అన్నాడు దివాను.

"అంటే, ఆ తాయెత్తు తప్ప మిగతా ఆస్తి అంతా నీ కిష్టమేనా?" అని న్యాయాధికారి అడిగాడు.

"చిత్తం! అదేగదండి నేను తమకు మనవి చేసుకుంటున్నది?" అన్నాడు దివాను ఉత్సాహంగా.

"అలా అయితే ఆ తాయత్తే నువు తీసుకుని, మీ యజమాని ఆస్తి అంతా ఈ కుర్రవాడి పరం చెయ్యి. నీ కిష్టమైనది ఈ కుర్రవాడిపరం చెయ్యమనే ఈ వాజ్మూలంలో ఉన్నది; నీ కిష్టమైనది నువు ఉరిచేసుకోవాలని ఇందులో ఎక్కడా లేదు!" అన్నాడు న్యాయాధికారి.

దివాను తెల్లముఖంవేసి ధనగుప్తుడి వాజ్మూలాన్ని మళ్ళీ చదివి, న్యాయాధికారి అన్నది నిజమేననీ, తన ఆటకట్టిందనీ గ్రహించి, ధనగుప్తుడి ఆస్తి అంతా ఆయన కొడుకు పరం చేసి, ముఖంచెల్లక మరో గ్రామానికి వెళ్ళిపోయాడు.






# తెలుసు-తెలియదు

మంగళపురి రాజ్యాన్ని మాయవర్మ మహా రాజు పాలించేవాడు. అయన ముఖ్యమంత్రి పోయాక రాజు కొత్త మంత్రిని నియమించక, తానే రాజూ, తానే మంత్రీ అయి రాజ్యపాలన చేయసాగాడు. రాజైనవాడు ప్రజల కష్టసుఖాలను స్వయంగా తెలుసుకోవాలని విని ఉండటం చేత అతను మారువేషం ధరించి, ఇద్దరు అంగరక్షకులను వెంట బెట్టుకుని, అప్పుడప్పుడూ ప్రజల మధ్య తిరుగుతూ ఉండేవాడు. ఇంత చేసినా రాజుకు మెదడు చాలా తక్కువ.

ఒక రోజున ఆ రాజు మారువేషంలో తిరుగుతూండగా, ఒక ఇంట భార్యా భర్తల మధ్య వాగ్యుద్ధం జరుగుతూండటం వినిపించింది.

"ఛీ, ఛీ! ఏం పని చేశావు? నీకు తెలీదని ముందే చెపితే, నేనే చేసేవాణ్ణిగా?" అన్నాడు భర్త.

"మీకేమి తెలుసు? ప్రతిదీ తెలుసు, తెలుసు అంటారే గాని, నేను కన్న పసి పాపకు తెలిసినంత కూడా మీకు తెలీదు," అన్నది భార్య.

"నోరుముయ్యి! నీకేమన్నా తెలిస్తేగద నీ పాపకు తెలిసి ఏడిచేది? ఈ ముష్టి పని కూడా నాకు తెలీదనా నీ ఉద్దేశం? అవకాశం దొరికితే ఈ రాజ్యాన్ని ఏలేపాటి తెలివి ఉన్నది నాకు," అన్నాడు భర్త.

ఈ మాట చెవిని పడగానే రాజు చెవులు మూసుకుని తిన్నగా ఇంటికి వెళ్ళాడు. మర్నాడే ఆయన ఒక శాసనం అమలు పరిచాడు. ఆ శాసనం ప్రకారం రాజ్యంలో ఏ ఒక్కడూ తనకు ఏదైనా తెలుసునని అనరాదు. "నాకు తెలుసు" అని ఎవరన్నా అన్నారో, వారు కఠినంగా శిక్షించబడతారు.

ఈ శాసనంతో ప్రజలకు పెద్ద చిక్కే వచ్చింది. శిక్షకు భయపడి వాళ్ళు ప్రతి

సి. ఉమావతి

దానికి "తెలియదు, తెలియదు," అనటం అలవాటు చేసుకున్నారు.

ఇలా ఉండగా ఆ రాజ్యంలోకి ఎవరో ఇద్దరు వేరే దేశం వాళ్ళు వచ్చారు. తాము ఎవరిని పలకరించినా, "తెలీదు, మాకు తెలీదు," అనే జవాబు రావటం వాళ్ళు గమనించారు. వాళ్ళు ఒక చోట కొంత మందిని సమీపించి, "ఏది అడిగినా ప్రతి ఒక్కరూ, తెలియదంటా రేమిటి?" అని అడిగారు.

"తెలియదండీ, మా కేమీ తెలియదు. మీరు అడిగే సంగతి ఏదీ మాకు తెలియదు," అన్నారు అక్కడివాళ్ళు.

"ఇదేం దేశం రా, పాడుదేశం! ఎవరిని ఏమడిగినా, తెలీదు, తెలీదంటారూ!" అని ఆ ఇద్దరు విదేశీయులూ తమలో తాము అనుకున్నారు.

ఇదంతా జరిగేటప్పుడు రాజు అక్కడే మా రు వే ష ం లో ఉండి, ప్రజలు అన్న మాటలూ, విదేశీయులు తమలో తాము అనుకున్న మాటలూ కూడా విన్నాడు.

అందుచేత రాజు మర్నాడు ఇంకో శాసనం జారీ చేశాడు: దేశంలో ఎవరూ ఏ పరిస్థితి లోనూ "తెలియదు" అనే మాట అన రాదు! అలా అన్నవాళ్ళు కఠిన శిక్షకు గురి



అవుతారు. ఇప్పుడు రాజ్యంలో "తెలును" అనే మాట గాని, "తెలియదు" అనే మాట గాని వినిపించరాదు. ప్రజల నోళ్ళు కట్టేసి నట్టయిపోయింది.

ఇదంతా విదేశీయులు ఉండగానే జరి గింది, కనక వాళ్ళ పని బొత్తిగా పాడై పోయింది. వాళ్ళు రాజుగారి దర్శనం కోసం వచ్చి, రాజుగారి కొక లేఖ పంపారు. అందులో ఇలా ఉంది:

"మహాప్రభూ, మేము మరొక దేశం నుంచి వచ్చిన యాత్రికులం. మీరు చేసిన నిషేధాజ్ఞల మూలాన మాకు నోరు తెరిచే అవకాశం లేకుండా పోయింది. విదేశస్థులం

కావడం చేత ఇది మాకు చాలా బాధగా ఉన్నది. మీరు ఇలాటి నిషేధం పెట్టటానికి తగిన మూలకారణం ఏదో ఉండి ఉంటుంది. దాన్ని మీరు మాకు తెలిపినట్టయితే ఇప్పు డేర్పడిన పరిస్థితిని చక్కబరచగలమని మనవి చేసుకుంటున్నాం."

రాజుగారు విదేశీయులను పిలిపించి, తాను మొదట విన్న భార్యా భర్తల సంభాషణ గురించి చెప్పాడు.

"ఆ భార్యాభర్తలు ఏ సందర్భంలో అలా మాట్లాడుకున్నారో అది తెలుసుకోవటం అవసరం," అన్నారు విదేశీయులు.

రాజు మారువేషం వేసుకుని, కొత్త వాళ్ళను వెంట బెట్టుకుని, భార్యా, భర్త లుండే ఇంటికి వెళ్ళి, ఇంటి మగవాడిని, "నువు ఇటీవల నీ భార్యతో, నీకు అన్నీ తెలుసుననీ, రాజ్యం ఏలటం కూడా తెలుసుననీ అన్న సంగతి గుర్తున్నదా?" అని ప్రశ్నించాడు.

"నా ఇంటిని ఏలటమే నాకు చాత కాలేదు, రాజ్యం ఎక్కడ ఏలి ఏడుస్తాను? నా భార్య వంట పాడుచేస్తే మాట వరసగా అన్నాను. చాతా వాతా గాని మనిషి అస్తమానమూ 'నీకేమీ తెలీదు' అంటుంటే ఎలా ఉంటుంది?" అన్నాడు మగవాడు.

"చూశారా, మహాప్రభూ! సామాన్య ప్రజలు మాటవరసగా అనే ప్రతి మాటా పట్టించుకుంటే ఎంత ఇబ్బందో? మీ కీ పాటి చెప్పే మంత్రులైనా లేకపోయారా?" అని విదేశీయులు రాజుతో అన్నారు.

"పాత మంత్రి పోయాడు. కొత్త మంత్రి నింకా వేసుకోలేదు. మీ రిద్దరూ నాకు మంత్రులుగా ఉండి సహాయం చేస్తారా? మీరు చాలా తెలివి గల వాళ్ళుగా కనబడుతున్నారు," అన్నాడు రాజు.

వాళ్ళు మంత్రులుగా పని చెయ్యటానికి ఒప్పుకున్నారు. తరవాత రాజ్యపాలన సవ్యంగా సాగిపోయింది.





# చెత్తమూట

కుశీనపురాన్ని నేత్రానందుడనే రాజు పరిపాలించేవాడు. అతని పరిపాలనలో అన్యాయాలూ, అక్రమాలూ, దొంగతనాలూ మచ్చుకైనా ఉండేవి కావు. అతని కింద నియోగితులైన వారందరూ అత్యంత సమర్థులు. తమ తమ కర్తవ్యాలు నిర్వహించటంలో ప్రత్యేక ప్రావీణ్యం చూపిన వారికి రాజు ప్రత్యేకమైన బహుమానాలు కూడా ఇచ్చేవాడు. అందుచేత వాళ్ళు రాజ్యంలో జరిగేదంతా వెయ్యికళ్ళతో కనిపెడుతూ ఉండేవాళ్ళు.

ఆ రాజ్యానికి ఒకనాడు ఒక బికారిలాటి వాడు వచ్చాడు. వాడి ఒంటి మీది బట్టలు మాసి, చినిగి ఉన్నాయి. గడ్డం బాగా పెరిగి ఉన్నది. మనిషి మట్టి కొట్టుకుని ఉన్నాడు. వాడి వెంట ఒక పాత గుడ్డల మూట ఉన్నది. వాడు దారి పొడుగునా యాచన చేస్తూ, అడిగిన వారితో తానొక బిచ్చగాణ్ణనీ, అనాథుణ్ణనీ చెబుతూ, సాయంకాలానికి ఒక సత్రం చేరుకుని, ఆ రాత్రికి సత్రం అరుగు మీద, మూట తన తల కింద పెట్టుకుని పడుకున్నాడు.

అర్ధరాత్రివేళ వాడు మంచి నిద్రలో ఉండగా, ఎవరో ఉపాయంగా వాడి తల కింది మూట తీసేసి, దాని స్థానంలో మరొక చింపిగుడ్డల మూట పెట్టి, వాడి మూటను ఎత్తుకు పోయారు.

తెల్లవారి లేచి వాడు తన మూటను ఎవరో ఎత్తుకు పోయినట్టు తెలుసుకుని, తన లోపల చాలా దిగులుపడి, తిన్నగా రాజుగారి దగ్గిరికి వెళ్ళి, "మహారాజా, ఈ దేశంలో దొంగతనాలూ, అక్రమాలూ లేవని తెలిసి, ఇక్కడే స్థిరపడి పోదామని, నా కున్నదంతా మూట కట్టుకుని ఈ దేశం వచ్చాను. నిన్న రాత్రి నేను సత్రంలో పడుకుని ఉండగా, ఎవరో నా మూట

బి. జగన్నాథం





తన పాత గుడ్డల మూటలో పెట్టుకుని, బిచ్చగాడి వేషంలో ఈ దేశం చేరాననీ. వాటితో ఇక్కడ గౌరవంగా బతుకుదామను కున్నాననీ చెప్పాడు.

అంతా విని రాజు, "ఈ దేశంలో అ క్రమాలూ, దొంగతనాలూ అసలే జరగవన్నది అతిశయోక్తి. అటువంటివి ఈ దేశంలోనూ జరుగుతాయి. అయితే ఏమిటంటే, ఇక్కడ జరిగిన దొంగతనం ఎంతో కాలం దాగదు. అక్రమం జరిగితే వెంటనే బయట పడి పోతుంది. అందుచేత నీ మూట ఎక్కడికీ పోదు. అది త్వరలోనే నీకు చేరేటట్టు చూస్తాను," అన్నాడు.

కాజేశారు. నా ముల్లె కాస్తా పోయింది. తమరు ఈ దొంగతనం ఆ చోకీ చేసి నా మూట నాకు ఇప్పించాలి," అన్నాడు.

రాజు ప్రశ్నించిన మీదట ఆ బికారివాడు తన పేరు సోమనాధుడనీ, తనది తొండ మండలం అనీ, అక్కడ తాను నగల వ్యాపారం చేస్తూ ఉండేవాడనీ, పారం రోజుల క్రితం ఎవరో తన ఇంటిని దోపిడీ చేసి, ఇల్లు తగల బెట్టారనీ, తన భార్యా, బిడ్డలూ ఆ ఇంటితో బాటే కాలిపోయారనీ, తానే ఎలాగో ఆ ఇంటి నుంచి బయటపడి, తన సొత్తులో నాలుగు వజ్రాలూ, నాలుగు బంగారు ఇటుకలూ దక్కించుకుని, వాటిని

ఆయన తన సేవకులతో, "ఈ సోమ నాధుడి చేత చక్కగా స్నానం చేయించి, కట్టుకునేటందుకు మంచి బట్ట లిచ్చి, భోజనం పెట్టించండి," అన్నాడు.

వాళ్ళు సోమనాధుణ్ణి తీసుకుపోయి, అతని ఒళ్ళంతా శుభ్రంగా తోమి, స్నానం చేయించారు. మంచి బట్ట లిచ్చారు. తర వాత మంచి భోజనం కూడా పెట్టించారు. ఆ రాత్రి సోమనాధుడు రాజుగారి దివాణం లోనే పడుకున్నాడు.

మర్నాడు తెల్లవారగానే రాజు సోమ నాధుణ్ణి పిలిపించి, అతనికి ఒక పాత



గుడ్డల మూట చూపి, "ఇదేనా నీ మూట?" అని అడిగాడు.

సోమనాథుడు దాన్ని గుర్తించి, ఆశ్చర్యానందాలతో, అవునన్నాడు. అతను చెప్పినట్టే ఆ గుడ్డల మూటలో నాలుగు వజ్రాలూ, నాలుగు బంగారు ఇటుకలూ కూడా దాచబడి ఉన్నాయి.

"పోయిన సొమ్ము ఇంత త్వరలో, చెక్కుచెదరకుండా దొరకటం చాలా ఆశ్చర్యం. కాని దొంగ ఏడీ?" అని సోమనాథుడు రాజును ప్రశ్నించాడు.

"నీ సొమ్ము నీకు దొరికింది గదా. దొంగ గురించి నీ కెందుకు విచారం? వాడి సంగతి మేము చూసుకుంటాం. ఇంత ఆస్తి దగ్గిర ఉంచుకుని నువు మా దేశంలో బిచ్చగాడుగా బతక నవసరం లేదు. ఎలా బతకాలని నిర్ణయించుకున్నావు?" అని రాజు అడిగాడు.

"మహారాజా, ఈ మూటలో ఉన్నదే నా కున్నదంతా. ఈ వజ్రాలనూ, బంగారాన్నీ తగిన వెలకు అమ్మి, దానితో సుఖంగా కాలక్షేపం చేద్దామనుకుంటున్నాను," అన్నాడు సోమనాథుడు..

"అలా అయితే ఒక వజ్రాన్ని నే నే కొందామనుకుంటున్నాను. వెల ఎంతో చెప్పు," అన్నాడు రాజు.





"మీరే తీసుకునేటట్టుంటే వెల ఎందుకు? ఒక వజ్రాన్ని కానుకగా పుచ్చుకోండి," అన్నాడు సోమనాథుడు.

"చాలా సంతోషం. ఒకటి కానుకగా ఇచ్చి, మరొక వజ్రాన్ని వెలకు అమ్ము," అన్నాడు రాజు.

"కొనాలని పట్టుబడితే మీకు ఇష్టమైనంత ఇవ్వండి," అన్నాడు సోమనాథుడు.

"అసలు దాని ధర ఎంతో చెప్పు. ఆ తరవాత నా ఇష్టమైనంతే ఇస్తాను," అన్నాడు రాజు.

"దాని అసలు వెల నూరు నాణాలు," అన్నాడు సోమనాథుడు.



"అంత తక్కువా? నగల వ్యాపారం చేశానంటున్నావు, దీని వెల ఇంత తక్కువ చెప్పావేం?" అన్నాడు రాజు.

"మహారాజా, నా కళ్ళ ఎదటే నా భార్యా, బిడ్డలూ దుర్మరణం పాలయారు. నా మతి మతిలో లేదు. వజ్రానికి మీరు మీకు తోచిన వెల ఇవ్వండి, తీసుకుంటాను," అన్నాడు సోమనాథుడు.

"సరే, వీటికి రత్నవర్తకుల చేత వెల కట్టించి వారెంత ఇయ్యమంటే అంత ఇస్తాను. నా దగ్గిర రెండు వజ్రాలున్నాయి. వాటి కింకా డబ్బివ్వలేదు. వాటిని చూసి, ఎంత ఇవ్వవచ్చునో చెప్పు," అని రాజు రెండు వజ్రాలు తెప్పించి సోమనాథుడికి చూపాడు.

సోమనాథుడు వాటిని చూసి, "ఒక్కొక్కటీ రెండేసివేలు చేస్తుంది," అన్నాడు.

"ఇంతేనా? వీటిని నాకు అమ్ముతున్న వర్తకుడు, ఒక్కొక్కటీ పదేసివేలు చేస్తుందంటున్నాడే!" అంటూ రాజు ఆ రెండు వజ్రాలను కూడా సోమనాథుడి దగ్గిరే ఉంచి తాను వెళ్ళిపోయాడు.

ఆ రాత్రి కూడా సోమనాథుడు దివాణంలోనే ఒక గదిలో పడుకున్నాడు. అతను ఆ రాత్రి మూడో ఝాములో లేచి, తన



మూట తీసుకుని, తానున్న ఇంటి వెనక భాగానికి పోయి, అక్కడ ఉన్న ప్రహరీ గోడ మీదిగా దూకి, వీధి వెంబడి పోతూ ఉండగా, రాజభటులు అతన్ని పట్టుకుని, తీసుకుపోయి కారాగృహంలో ఉంచారు.

మర్నాడు రాజుగారు సోమనాధుణ్ణి విచారణ చేశాడు. ఆ సమయంలో రాజు ఈ కింది విషయాలను బయట పెట్టాడు.

అధికారుల కంట పడకుండా ఎవరూ రాజ్యంలోకి అడుగు పెట్టలేరు. సోమనాధుడు రాజ్యపు పొలిమేరలోకి వచ్చిన క్షణం నుంచీ అతన్ని అధికారులు కనిపెట్టే ఉన్నారు.



పనికిమాలిన గుడ్డల మూట గురించి సోమనాధుడు కనబరిచే శ్రద్ధ చూడగా, అందులో విలువగల వస్తువు లున్నట్టు స్పష్టమయింది. సత్రం అధికారే అర్ధరాత్రి వేళ ఆ మూటను సోమనాధుడి తలకింది నుంచి తీయించాడు. ఈ రాజ్యంలో దొంగతనాలు జరగవని విని ఉండటంచేత సోమనాధుడు నిశ్చింతగా, ఆదమరిచి నిద్రపోయాడు.

దొంగిలించిన మూటను సత్రం అధికారి రాజుగారికే పంపించాడు. తన మూట పోవటం గురించి సోమనాధుడు సత్రంలో ఎవరితోనూ ఏమీ అనక తిన్నగా రాజుగారికే ఫిర్యాదు చెయ్యటంలో విశేషం ఉన్నది. ఆ మూటలో విలువగల వస్తువు లున్న సంగతి దొంగలకు గాని, మామూలు మనుషులకు గాని తెలియటం సోమనాధుడికి ఇష్టం లేదు. అందుచేత ఆ మూటలో ఉన్నది దొంగసొమ్ము అయిఉండవచ్చు.

సోమనాధుడు తన పూర్వకథ రాజుగారితో చెప్పాడు. అందులో ఒక్కటి కూడా నిజం కాదని స్పష్టమయింది. తన మూటలో మిగిలిన కొద్ది సొత్తు కోసం రాజుగారికి ఫిర్యాదు చేసినవాడు, తన యావదాస్తీ, భార్యా, పిల్లలూ, ఇల్లూ పోతే వెంటనే స్వస్థలం విడిచి, దేశాంతరాలకు

బయలుదేరాడు. అతని స్వస్థలం నుంచి ఈ రాజ్యానికి కనీసం వారంరోజుల ప్రయాణం.

కాలిపోయిన ఇంటి నుంచి కొద్ది సొత్తు తోనూ, ప్రాణాలతోనూ బయటపడ్డా నంటున్న సోమనాధుడి శరీరం మీద ఒక్క గాయం గాని, కాలినబొబ్బ గుర్తు గాని లేదని అతని చేత స్నానం చేయించిన రాజభ టులు చెప్పారు.

భోజనం చేసేటప్పుడు కూడా సోమ నాధుడు ఏనాడూ శ్రీమంతుడు కాడనీ, చాలా హీనమైన తిండికి అలవాటైనవాడనీ స్పష్టమయింది.

అతనికి వజ్రాల విలువ ఏమీ తెలీదు. తన వద్ద ఉన్న వజ్రాల ధర చెప్పలేకపోగా, రాజుగారు చూపించినవి రెండూ గాజు రాళ్ళని కూడా సోమనాధుడు తెలుసుకో లేక, వాటి ధర రెండేసి వేలుంటుందని అమాయకంగా అన్నాడు.

ఇన్ని సంగతులు తెలుసుకున్నాక సోమ నాధుడు తన మూట దొరికిన రోజు రాత్రి పారిపోవటానికి యత్నిస్తాడని రాజుగారు సరిగా ఊహించి, పారిపోతూండగా పట్టు కునేటందుకు మనుషులను ఏర్పాటు చేశాడు. సోమనాధుడు దొరికిపోయాడు.

రాజుగారు తనను గురించి ఇన్ని విష యాలు బయట పెట్టాక సోమనాధుడు నిజం ఒప్పుకోక తప్పలేదు. తాను వారికీ, వీరికీ సేవలు చేసుకు బతికేవాడి ననీ, ప్రయాణం చేస్తున్న ఒక సార్థవాహుడి నౌకరుగా ఉంటూ, వీలు చూసుకుని ఆ వర్తకుడి సొమ్ములో నుంచి నాలుగు వజ్రాలూ, నాలుగు బంగారు ఇటుకలూ కాజేసి, పారిపోయి వచ్చాననీ సోమనాధుడు ఒప్పుకున్నాడు.

రాజు సోమనాధుడికి తగిన శిక్ష విధించి, అతను కాజేసిన వజ్రాలూ, బంగారమూ ఆ వర్తకుడికి తిరిగి చేరే ఏర్పాటు చేశాడు.





# మంచికి మంచి

ఆనందపుర మనే ఊరిలో కాంతివర్మ అనే సంపన్ను డుండేవాడు. అతనికి సంతానం లేకపోవటం తీరని బెంగగా ఉండేది.

ఆ వూరికి ఒకనాడు ఒక యోగి వచ్చాడు. ఆయన అస్తమానమూ సంచారం చేస్తూ ఉంటాడు. ఏ ఊళ్ళోనూ మూడు రోజుల కన్న ఉండడు. అతనిచ్చే ప్రసాదం కోసం జనం ఎగబడతారు. ఆ ప్రసాదం మహిమలో అందరికీ నమ్మకం ఉన్నది.

కాంతివర్మ ఆ యోగిని సందర్శించి, తన సంతాన హీనత గురించి చెప్పుకున్నాడు. ఆ సమయానికి పాలుతాగబోతున్న యోగి, ఆ పాలలో కొంచెం ఒక దొన్నెలో పోసి, కాంతివర్మ కిస్తూ, "ఈ పాలను నీ భార్య ఒక్క గుక్కలో తాగినట్టయితే నీ కోరిక నెరవేరుతుంది," అని చెప్పాడు.

కాంతివర్మ ఆ పాలను తీసుకు పోయి తన భార్య కిచ్చి, "దీన్ని ఒక్క గుక్కలో తాగు," అని చెప్పాడు. కాంతివర్మ భార్య ఆ దొన్నెను తాను పూజ చేసుకునే దేవుడికి నైవేద్యం పెట్టి, తీర్థం పుచ్చుకున్నట్టుగా చేతిలో పోసుకుని, కళ్ళకద్దుకుని, రెండు పుడిసెళ్ళు చేసి తాగింది.

తరవాత ఆమె గర్భం ధరించింది. కాల క్రమాన ఆమెకు ఇద్దరు ఆడపిల్లలు కలిగారు. పిల్లలు చాలా అందంగా ఉన్నారు. కాని, వారు పాకే దశ వచ్చేసరికి, ఇద్దరికీ కూడా ఒక్కొక్క కాలు బలహీనంగా ఉన్నట్టు బయటపడింది. ఒక కాలు అవుడు కావటం చేత వాళ్ళు సరిగా నడవలేక పోయినారు.

కాంతివర్మ ఎంతో డబ్బు ఖర్చు చేసి తన పిల్లల అవిటి కాళ్ళకు ఎన్నో చికిత్సలు చేయించాడు. కాని ఏమీ ఫలితం లేక పోయింది. పిల్లలు చూడబోతే చక్కని చుక్కలు. కాని ఇల్లు దాటి పోలేరు. తమ

ఆర్. రాజగోపాలరావు



అవిటి నడక ఎవరైనా చూస్తారని వాళ్ళకు సిగ్గు. మగపిల్లలైనా కుంటితనం అంత బాధించక పోను, వీళ్ళు ఆడపిల్లలయారు!

అయినా కాంతివర్మ తన పిల్లలను ఎంతో ప్రేమగా పెంచుతూ వచ్చాడు.

తిరిగి పన్నెండేళ్ళకు ఆ యోగి ఆ గ్రామం వచ్చాడు. కాంతివర్మ యోగిని సందర్శించి, "స్వామీ, తమ అనుగ్రహం చేత నాకు ఇద్దరు ఆడపిల్లలు కలిగారు. కాని వాళ్ళు అవిటివాళ్ళు. వాళ్ళ భవిష్యత్తు తలుచుకుంటే భయంగా వుంది. తమరే అనుగ్రహించి వాళ్ళ అవిటితనం పోగొట్టాలి," అని ప్రాధేయపడ్డాడు.

యోగి కాస్సేపు కళ్ళు మూసుకుని ఆలోచించి, "నీ భార్య నేను చెప్పినట్టు చెయ్యకపోవటం చేత ఈ చిక్కు వచ్చి పడింది. నా దగ్గర ఈ అరటిపండు తప్ప ఇంకేమీ లేదు," అని, అరటిపండులో ఒక చిన్న ముక్క తుంచి తన నోట్లో వేసుకుని, మిగిలినది కాంతివర్మ కిస్తూ, "దీన్ని నీ యిష్టం వచ్చిన మనిషి కిచ్చెయ్యి," అని, అతన్ని ఇంకేమీ చెప్పనివ్వకుండా అక్కడి నుంచి పంపేశాడు.

కాంతివర్మ ఆ అరటిపండు తీసుకుని, దాన్ని తన కుమార్తె లిద్దరిలో ఎవరి కివ్వటానికీ పాలుపోక, మనసులో గుంజాటన పడుతూ, ఇంటిదారి పట్టాడు. అప్పుడు ఇద్దరు పిల్లలకూ ఉన్నదని తెలిసి యోగి ఒక్కరికే ప్రసాదం ఎందుకిచ్చాడు? ఈ ప్రసాదంతో ఒక పిల్లకే అవుడు నయమైతే రెండో పిల్ల ఎంత బాధపడుతుంది! ఇద్దరినీ సమంగా ప్రేమించుకుంటున్న తాను మాత్రం ఒక పిల్ల అవుడు పోయి, రెండో దానిది పోకపోతే ఎంతగా బాధపడవలసివస్తుంది.

ఇలా ఆలోచిస్తూ తల వంచుకుని నడుస్తున్న కాంతివర్మ ఎవరో ఏడుస్తూ ఉండటం విని తల ఎత్తి చూశాడు. ఒక బావి దగ్గర

ఒక యువతి కూర్చుని ఏడుస్తున్నది. ఒక యువకుడు అమెను సమాధాన పరచటానికి ఏమిటో చెబుతున్నాడు. కాంతివర్మ తమ సమీపంలో ఆగటం చూసి, ఆ యువకుడు, "అయ్యా, మీరయినా ఈమెకు కాస్త బుద్ధి చెప్పండి! బావిలో పడతానంటున్నది," అని వేడుకున్నాడు.

"అసలు విషయమేమిటి?" అని కాంతి వర్మ ఆ యువకుణ్ణి అడిగాడు. యువకుడు యిలా చెప్పాడు.

ఆ యువతికి చిన్న తనంలోనే బాలపక్ష వాతం వచ్చి ఎడమచెయ్యీ, ఎడమకాలూ పడిపోయాయి. ఆమె నెవరూ పెళ్ళాడారు కారు. ఈ యువకుడు ఆమెను చూసి జాలిపడి, ఆమెను పెళ్ళాడి తన యింటికి తెచ్చుకున్నాడు.

ఆ యువకుడైనా ధనికుడు కాడు. అతనికి రెక్కాడితే గాని డొక్కాడదు. అతను తన భార్యకు ఇంటి దగ్గిర అవసరమైన ఉపచారాలన్నీ చేసి, పని చేసుకునేటందుకు బయటికి పోతూ ఉండేవాడు.

కొంతకాలం ఇలా జరిగాక తన భర్త తన కోసం పడుతున్న కష్టాన్ని ఆమె సహించలేక పోయింది. అన్ని పనులూ అతను చేసి పెడుతూంటే తాను కదలకుండా కూర్చుని చేయించుకోవటం ఆమెకు చాలా ఘోరంగా



కనబడింది. తాను ఆత్మహత్య చేసుకుంటే తన భర్త ఎక్కడైనా ఇంకొకతెను చూసి పెళ్ళి చేసుకుని సుఖపడతాడని ఆమె నిశ్చయించుకున్నది.

"ఈమెకు కాలూ, చెయ్యీ అవుడని తెలిసే నేను పెళ్ళి చేసుకున్నాను. ఈమెకు పనులు చేసి పెట్టటమే నాకు ఆనందమని ఎంత చెప్పినా నమ్మకుండా ఉన్నది. ఈమె బలవంతంగా చచ్చిపోతే నేనూ అలాగే చచ్చిపోతాను. ఆ మాట కాస్త ఈమెకు బాగా అర్థమయేట్టు మీరైనా చెప్పండి," అన్నాడా యువకుడు.

యోగి ఇచ్చిన ప్రసాదాన్ని ఆ యువతి కిచ్చి, ఆ దంపతుల కష్టాలు తొలగించా లన్న కోరిక కాంతివర్మకు తీవ్రంగా కలి గింది. అతను తన వద్ద నున్న అరటిపండు ఆమె కిచ్చి, "ముందు ఈ అరటిపండు తిను. తరవాత మీకు తగిన సలహా ఇస్తాను," అన్నాడు.

ఆమె పండు తిన్నది. ఆమెలో ఏదో పెద్ద మార్పు వచ్చినట్టయింది. ఆమె చివాల్న లేచి నిలబడి, చేతులు రెండూ ఎత్తి జోడించి కాంతివర్మకు నమస్కారం చేసింది. ఆమె భర్త పొందిన ఆశ్చర్యానికీ, ఆనందానికీ అంతులేదు.

"మీ కష్టాలు తీరాయి. ఇక వెళ్ళి రండి," అని కాంతివర్మ వారిని సాగనంపి, తాను ఇంటి దారి పట్టాడు. తాను అను కున్న పని నెరవేరనందుకు బాధ కలిగినా, ఒక కూతురు అవుడు సరి అయి, రెండో దాని అవుడు అలాగే ఉండి పోవటంతో తనకు కలిగే బాధ తప్పింది కదా అనీ, ఒక సంసారం తన మూలాన సుఖపడింది గదా అనీ అతను తృప్తిపడ్డాడు.

కాని అతను ఇంటికి చేరుకునేసరికి తన పదకొండేళ్ళ కూతుళ్ళిద్దరూ పరిగెత్తుకుంటూ ఎదురు వచ్చేసరికి కాంతివర్మ పొందిన ఆశ్చర్యానందాలను ఎలా వర్ణించడం!





# డబ్బుకొద్ది చికిత్స

ఒక గ్రామంలో బంగారయ్య అనే ధనికు డుండేవాడు. ఆ చుట్టు పక్కల అతనితో సమానమైన ఆస్తిపరుడు లేడు. అయితే అతను గొప్ప పిసినారి. కాకికి ఎంగిలి చెయ్యి దులిపేవాడు కాడు.

పిసినారి బంగారయ్యకు ఒకసారి కంటి జబ్బు వచ్చింది. కళ్ళ వెంబడి అదే పనిగా నీరు కారటమూ, విపరీతమైన మంటా, తల నొప్పి, వీటితోబాటు దృష్టిమందగించటమూ పట్టుకున్నాయి.

పొరుగు గ్రామంలో ఒక గొప్ప వైద్యు డుండేవాడు. ఆయన ఇచ్చే మందులు రామబాణాల వంటివి. వాటికి తిరుగు లేదు. వైద్యంలో ఆయనకు ఎంత పేరంటే ఆ ప్రాంతాలలో ఉండే గ్రామాలలో మరొక వైద్యుడెవడూ బతకలేకపోయాడు.

ఈ వైద్యుడిలో ఒక గుణం ఉన్నది. ఆయన రోగియొక్క స్థితిగతులు చూసి మరీ మందిచ్చేవాడు, డబ్బు కూడా ఆ విధం గానే రాబట్టేవాడు. బీదా బిక్కీ అయితే వాళ్ళకు తగ్గ మందే ఇచ్చి, వాళ్ళు ఎంత ఇస్తే అంతే పుచ్చుకునేవాడు.

పిసినారి బంగారయ్యకు ఆ వైద్యుడంటే ఇందుకే కోపం. ఒకప్పుడాయన ఆ వైద్యుడి చేత ఏదో చికిత్స చేయించుకుని నూరు రూపాయలు ఇచ్చుకోవలిసి వచ్చింది.

ఇప్పుడు బంగారయ్యను పట్టుకున్న రోగానికి చికిత్స చెయ్యాలంటే ఆ వైద్యుడే చెయ్యాలి. ఎందుకంటే అనేక కోసుల దూరంలో మరొక వైద్యుడే లేడు. ఈయన చేత చికిత్స చేయించుకుంటే డబ్బు బాగా వదులుతుంది.

అందుకని బంగారయ్య ఒక పేదవాడి లాగా నటిస్తూ వెళ్ళి, వైద్యుడి దగ్గిర చికిత్స పొందాలని ఆలోచించాడు. ఆయన ఒక చింపిపాత కట్టుకుని, తలకు మరొక చింపి

ఏ. సత్యనారాయణ



పాత చుట్టుకుని, తాంబూలంలో రెండ ణాలు పెట్టుకుని, వైద్యుడి ఇంటికి వెళ్ళి, తన అవతారానికి తగ్గట్టు యాసగా మాట్లా డుతూ, తన కంటి జబ్బు గురించి ఆయనకు చెప్పుకుని, చికిత్స చెయ్యమని దీనంగా వెడుకున్నాడు.

"నీ జబ్బు నేను నయం చేస్తాను. భయపడకు. నేను చెప్పినట్టు చెయ్యి. నాలుగు ముల్లంగి దుంపలు తెచ్చి, వాటిని చక్రాలుగా తరిగి, ఉప్పు అద్దు. నీరు బయటికి వస్తుంది. ఆ నీటిలో ఇంగువ చేర్చి తాగు. తరవాత ఆ ముల్లంగి చక్రా లను ఎండబెట్టి రాత్రి పూట తిను. ఇలా ఒక మండలం రోజులు తిన్నావంటె నీ రోగం పూర్తిగా నయమవుతుంది," అన్నాడు వైద్యుడు.

బంగారయ్య ఇంటికి తిరిగి వచ్చి, వైద్యుడు చెప్పినట్టే నలభైరోజులూ చేశాడు. కాని చికిత్స చాలా అసహ్యమనిపించింది. ఇంగువా, ముల్లంగీ వాసన కొట్టే ఉప్పు నీళ్ళు తాగటమూ, ఎండబెట్టిన ముల్లంగి ముక్కలు తినటమూ అంటే చక్కని భోజనం తినేవాడికి రోతగానే ఉంటుంది మరి. నలభైరోజులపాటు పళ్ళ బిగువున ఈ చికిత్స చేసుకున్నందుకు జబ్బేమో నయమయింది, కాని బంగారయ్య జిహ్వకు చవిచచ్చింది.

అందుచేత బంగారయ్య చికిత్స పూర్తి కాగానే నోటికి సుఖంగా లడ్డూలు చేయించు కుని, అత్రంకొద్దీ మితిమీరి తిన్నాడు. దాంతో బంగారయ్యకు అజీర్తి, అమిత దాహమూ, అగ్నిమాంద్యమూ, కడుపు నొప్పి పట్టుకున్నాయి. మళ్ళీ వైద్యుడితో పనిపడింది.

బంగారయ్య మళ్ళీ పాతవేషమే వేసు కుని, తాంబూలంలో రెండణాలు ఉంచు కుని, వైద్యుడు దగ్గిరికి వెళ్ళాడు; వెళ్ళి, తన పాతరోగం నయమయిందనీ, కొత్తరోగం



పట్టుకున్నదనీ, దానికి కూడా చికిత్స చేసి పుణ్యం కట్టుకోమనీ వైద్యుణ్ణి వేడుకున్నాడు.

వైద్యుడు బంగారయ్య నాడి పరీక్షించి, "ఏం తిని ఇంత అజీర్తి తెచ్చుకున్నావు? నువ్వు తిన్నదాన్ని బట్టి మందు ఇవ్వవలసి ఉంటుంది," అన్నాడు.

"లడ్డూలు తిన్నానండీ," అన్నాడు బంగారయ్య.

"ఇంత అజీర్తి చెయ్యాలంటే చాలా లడ్డూలు తిని ఉండాలే! నీ కెక్కడివిరా అన్ని లడ్డూలూ?" అని వైద్యుడు అడిగాడు.

బంగారయ్య మాట మార్చటానికి, "అయ్యో, కడుపునొప్పి మెలిపెట్టేస్తున్నది. ముందు మందివ్వండి. అదంతా తరవాత చెబుతాను," అన్నాడు.

"నీ చేత ఇన్ని లడ్డూలు తినిపించిన వాడు సంపన్నుడే అయి ఉండాలి. ఆ సంపన్నుడెవరో తెలిస్తేగాని మందు ఇవ్వను. రోగం తెప్పించినవాడు మందు ఖర్చు మాత్రం ఇచ్చుకోలేడా?" అన్నాడు వైద్యుడు కోపంగా.

"బంగారయ్యగారేనండి. ఆయన కింద పని చేసేవాణ్ణి. శానా రోజులయింది, చూసి పోదామని నిన్న వెళ్ళాను. లడ్డూ లిచ్చారు. నోటి ఆత్రం కొద్దీ తినేశాను," అన్నాడు బంగారయ్య.

"ఇంకేం? మందుకు యాభైరూపాయ లవుతుందని చెప్పి పట్టుకురా. ఈ లోపల నీ రోగానికి మందు సిద్ధంచేసి ఉంచుతాను," అన్నాడు వైద్యుడు.

"అది తప్పు కాదండీ? వారు పెట్టిన లడ్డూలు తిని రోగం తెచ్చుకున్నది చాలక, దానికి మందు ఖర్చు కూడా వారినే ఇయ్య మని ఎట్లా అడుగుతానండి? అది నా వల్ల కాదండి," అన్నాడు బంగారయ్య.

"నీ వల్ల కాకపోతే నేనే అడిగి తీను కుంటాలే. నా కీ పూట బంగారయ్యగారి

ఊరు పోవలిసిన పని కూడా ఉన్నది," అంటూ వైద్యుడు ఏదో చూర్ణాన్ని బంగా రయ్య నోట వేసి, ఇన్ని నీళ్ళు తాగించి, రోగం బాగై పోతుంది పొమ్మన్నాడు.

బంగారయ్య నోరంతా భగ్గున మండింది. నాలుక విలవిల లాడింది. కళ్ళు తిరిగినట్ట యింది. చెవులు గడియలు పడ్డాయి. అడ్డ దారిన గబగబా ఇంట్లో వెళ్ళిపడి, తియ్యగా ఏదన్నా నాలుకకు రాచుకుందా మనుకున్న బంగారయ్య, కొంతదూరం వెళ్ళి, ఆ పైన నడవలేక, ఒక చెట్టు కింద చతికిలబడి, నోరు తెరిచి రోజసాగాడు.

ఈ లోపలనే వైద్యుడు చుట్టు దారిన బంగారయ్య ఇల్లు చేరి, బంగారయ్య ఎటో వెళ్ళాడనీ, త్వరలోనే రావచ్చుననీ తెలుసు కుని, బంగారయ్య కోసం ఎదురు చూస్తూ వేచి ఉన్నాడు.

కొంతసేపటికి బంగారయ్య ఆపసోపాలు పడుతూ ఇల్లు చేరి, తలవని తలంపుగా వైద్యుణ్ణి చూసి కంగారు పడుతూ, "మీరా? ఇక్కడా?" అంటూ గోడపక్కనున్న కుర్చీలో కూలబడ్డాడు.

వైద్యు డాయనను చూసి, "నేను అను మానిస్తూనే ఉన్నాను. ఎందుకంటే, మీకు వచ్చిన జబ్బు కాయకష్టం చేసే వాళ్ళకూ, బీదవాళ్ళకూ వచ్చే జబ్బు కాదు. మీరు కంటి జబ్బుతో వచ్చి మందడిగినప్పుడు, నిజంగా బీదవాడే అనుకుని మోట వైద్యం చెప్పాను. మీలాటి వాళ్లకు అలాటి వైద్యం పట్టదు. మీ వంటి వాళ్ళకోసం రుచికరమైన లేహ్యాలూ, సువాసనకరమైన లేపనాలూ, తైలాలూ ఉన్నాయి. ఈ అజీర్ణానికైనా అంతే. మీరు డబ్బు కోసం చూడకండి; దివ్యమైన ఔషధాలున్నాయి — తియ్యని రోగాలకు కమ్మని మందులు!" అన్నాడు.

బంగారయ్యకు వైద్యుడు మంచి మందు లిచ్చి చికిత్స చేసి, దండిగా డబ్బు వసూలు చేసుకున్నాడు.





# ఆవుదూడ

ఒక ఊళ్ళో దయానిధి అనే బీదగృహస్థు ఉండే వాడు. అతనికి గల కొద్ది పాటి పొలం మీద జీవయాత్ర సాగించటం చాలా కష్టంగా ఉండేది. అతనికి ఒక ఆవుండేది.

నడివేసవిలో ఒక దారి ప్రయాణీకుడు ఎండకు తట్టుకో లేక దయానిధి ఇంటి అరుగు మీద చతికిలబడి, దాహం అడిగాడు. దయానిధి అతనికి ఇంత మజ్జిగ నీరిచ్చి, వడదెబ్బనుంచి తేరుకునే దాకా తన ఇంట్లోనే కూర్చొమని ఆ మనిషిని కోరాడు.

ఆ తరవాత ఇద్దరూ ఆ కబురూ యీ కబురూ చెప్పుకోవటంలో దయానిధి దారిద్ర్యం మాటల బయటపడింది.

"మా ఆవు చూడిగా ఉన్నది. ఇంకో నెలకు ఈనవచ్చు. ఈ లోపుగా మంచి ధరవస్తే దాన్ని అమ్మేద్దా మనుకుంటున్నాను. నే నున్నస్థితిలో దాన్ని పోషించలేనండీ," అన్నాడు దయానిధి.

రెండో మనిషి ఆవును పరీక్షించి, "ఇది చాలా మంచి లక్షణాలు గల ఆవు. ఇటువంటిది ఇంట్లో ఉంటే ఎంతో కలిసివస్తుంది.. దీన్ని అమ్మకు," అని సలహా ఇచ్చాడు.

దయానిధి అతని మాటలో విశ్వాసం ఉంచి, ఆ ఆవును అమ్మే ఆలోచన మానేశాడు. మరొక నెల గడిచాక ఆ ఆవు ఒక కోడెదూడను ఈని చనిపోయింది.

అయినా దయానిధి ఆవును అమ్మనందుకు పశ్చాత్తాప పడక, దాని దూడను ప్రేమగా పెంచుకుంటూ వచ్చాడు.

ఒకనాడు దయానిధి ఇంటలేని సమయంలో ఆ దూడ కట్టుతాడు తెంచుకుని, స్వతంత్రం వచ్చిన ఆనందంలో ఎటో పరిగెత్తిపోయి, చీకటి పడేవేళకు అడవిలో చిక్కుకు పోయింది.

ఆ క్రితం రాత్రి రాజభవనంలో దొంగతనం జరిగింది. చాలా సొత్తుపోయింది.

టి. అనసూయాదేవి

దొంగతనం చేసిన వాడు పగలల్లా అడవిలో దాగి ఉండి, చీకటి పడగానే, తాను దొంగి లించిన వస్తువుల మూటను నెత్తిన పెట్టు కుని, అడవి దాటి మరోరాజ్యానికి పోవాలని బయలుదేరాడు.

నెత్తిన ఉన్న బరువు జాస్తిగా ఉండటం చేత వాడు శ్రమపడుతూ నడిచి వెళు తూండగా ఒక చెట్టు కింద దయానిధి దూడ కనబడింది. దొంగవాడు వెంటనే తన మూటను దూడ వీపుకు కట్టి, దాని మెడ తాడు పట్టుకుని ఈడ్చుకు పోసాగాడు. అది అంబా అని అరవ నారంభించింది.

ఈ లోపల, దయానిధి చీకటి పడేవేళకు ఇంటికి వచ్చి, దూడ తెంచుకు పోయిందని తెలుసుకుని, ఇద్దరు ముగ్గురు గ్రామస్థు లనూ, రెండు లాంతర్లనూ వెంట బెట్టుకుని దూడకోసం వెతుకుతూ అడవి కేసివచ్చాడు.

వాళ్ళు అడవిలోకి ప్రవేసించిన కొంచెం సేపటికి దూడ అరవటం వినిపించింది.

"దొరికావురా, బుజ్జీ! ఉండు, వస్తున్నా!" అని దయానిధి కేక పెట్టాడు.

దొంగవాడు ఆ కేక విన్నాడు. ముగ్గురు నలుగురు మనుషులు రావటం చూశాడు. వాడు దూడనూ, తన మూటనూ కూడా వదిలేసి, కాలి సత్తువ కొద్దీ పారిపోయాడు.

తన దూడ మీద కట్టి ఉన్న మూటను చూసి దయానిధి ఆశ్చర్యపోయాడు. దూడను ఇంటికి తోలుకు పోయి, మూట విప్పి చూస్తే అందులోని వస్తువులు రాజ భవనాని వని అనుమానం వేసింది.

తెల్లవారగానే దయానిధి ఆ మూటను రాజభవనానికి చేర్చి, అది తనకు ఎట్లా దొరికినదీ రాజుగారికి చెప్పాడు.

రాజుగారు చాలా సంతోషించి, దయానిధి బీదవాడని తెలిసి అతనికీ, అతని వెంట వెళ్ళిన వారికీ మంచి బహుమానాలిచ్చాడు. ఆవుదూడ పోషణ కింద మంచి భూమి నాలుగెకరాలను దానం చేశాడు.





# కృష్ణావతారం

కృష్ణుడు ప్రారంభించిన యజ్ఞం పూర్తి అయింది. అనేక వేలమంది బ్రాహ్మణులకు సంతర్పణ జరిగింది. అర్జునుడూ, సాత్యకీ మొదలైన వాళ్ళను యాభైమందిని తన పంక్తిన పెట్టుకుని కృష్ణుడు విందు ఆరగించాడు. తరవాత అందరూ సభా భవనంలో చేరి కులాసాగా కబుర్లు చెప్పుకునేటప్పుడు అర్జునుడు కృష్ణుణ్ణి, "ఇంతకూ ఆ బ్రాహ్మణుడి కొడుకులు ఎలా పోయారు? వాళ్ళను ఎవరు ఎత్తుకుపోయారు? ఎక్కడ దాచారు?" అని అడిగాడు.

"సమస్త సృష్టికి మూలకారణమైన పరమేశ్వరుడు నన్ను చూడగోరి, బ్రాహ్మణ కార్యాన్ని నేను అలక్ష్యం చెయ్యను గనక, బ్రాహ్మణ బాలకులను మాయం చేస్తూ వచ్చాడు. ఆయన కోరిక తీర్చటానికి నేను సముద్రాన్ని పాయలుగా చీల్చి, కొండలను తోసి దారిచేసుకుని వెళ్ళవలసి వచ్చింది," అన్నాడు కృష్ణుడు.

తరవాత అర్జునుడు తిరిగిపోయి ధర్మరాజుకు తాను చూసిన వింతలన్నీ చెప్పి, ఆయనకు అంతులేని సంతోషం కలిగించాడు.

ఒకనాడు రుక్మిణి కృష్ణుడితో, "నేను ప్రద్యుమ్నుడు మొదలైన పిల్లలను కన్నాను గాని, నా కింకా సంతాన కాంక్ష తీరలేదు. నీ వంటి కొడుకును ఇంకొక్కణ్ణి కనాలని ఉన్నది," అన్నది.

"శంకరుణ్ణి ఆరాధించి నీకు మరొక కొడుకును కంటాను. తపస్సు ద్వారా లభిం





చని దంటూ లేదు. హిమాలయానికి వెళ్ళి శంకరుడికి నమస్కారం చెయ్యటంతో బాటు, దారిలో బదరీవనంలో ఉండే మహా తపస్సంపన్నులను కూడా చూడాలని ఉన్నది. ఇందువల్ల అనేక శుభాలు కలుగుతాయి. కనక నేను కైలాశయాత్ర చేసి వస్తాను," అన్నాడు కృష్ణుడు.

మర్నాడు ఉదయం కృష్ణుడు కాలకృత్యాలు తీర్చుకుని, సభాభవనానికి రావలసిందని బలరాముడికీ, సాత్యకికీ, ఉగ్రసేనుడికీ, కృతవర్మకూ, ఉద్ధవుడికీ, మిగిలిన ప్రముఖులకూ కబురు చేశాడు. కొద్దిసేపట్లో అందరూ సభాభవనంలో సమావేశమయారు. అప్పుడు కృష్ణుడు వారితో ఇలా అన్నాడు:

"నేను నా విరోధులందరినీ చంపేశాను గాని ఇంకా ఒకడు మిగిలి ఉన్నాడు. వాడు సామాన్యుడు కాడు, చాలా ధైర్య పరాక్రమాలు గలవాడు. వాడి పేరు పౌండ్రుడు. వాడికి నేనంటే పగ. నాకు వాడంటే భయం ఉన్నది. వాణ్ణి చంపితేనే గాని నేను నిజంగా విజయం సాధించాననుకోను. నా కిప్పుడు కైలాసయాత్ర చేయవలసిన పని పడింది. నేను వెళ్ళగానే పౌండ్రుడు వచ్చి మన నగరం మీద దాడి చేస్తాడు. వాడు ప్రపంచంలో యాదవు డన్నవాడు లేకుండా చేయగలిగినవాడు. అందుచేత నేను తిరిగి వచ్చేదాకా మీరు వెయ్యి కళ్ళతో అహర్నిశలు నగరాన్ని కాపాడాలి. నగరద్వారా లన్నిటినీ గట్టిగా రక్షించండి. అనుమతి లేకుండా ఎవరినీ లోపలికి రానివ్వవద్దు, బయటికి పోనివ్వవద్దు. చతురంగ బలాలనూ అయత్తం చేసి ఉంచండి. ఆయుధాలన్నిటినీ సిద్ధపరచండి. అన్ని దిక్కులా చక్కగా రక్షించుకోండి."

తరవాత అతను సాత్యకితో, "ఈ నగరాన్ని రక్షించే భారం ప్రధానంగా నీ పైన ఉంచుతున్నాను. యాదవ సంపద కంతకూ





నిన్నే రక్షకుడుగా ఏర్పాటు చేస్తున్నాను," అని చెప్పాడు.

"నీ అజ్ఞా, బలరాముడి అండా ఉంటే నేను చెయ్యలేని దేమి ఉంటుంది? పొంౘడు దేమిటి, ఇంద్రుడే దిక్పాలకు లందరినీ, దేవతలనూ వెంటబెట్టుకుని ఎత్తివచ్చినా సరే నేను లక్ష్యపెట్టను," అన్నాడు సాత్యకి.

కృష్ణుడు ఉద్ధవుడితో, "గురువర్యా, నువు బుద్ధికి బృహస్పతివి. నీకు నేను చెప్పట మేమిటి? పరాక్రమవంతులైన మన యాదవవీరులను నీ బుద్ధిబలంతో నడిపించు," అన్నాడు. అతను ఇదే విధంగా బలరాముణ్ణీ, ఉగ్రసేనుణ్ణీ, ఇతర యాదవ ముఖ్యులనూ హెచ్చరించి, గరుత్మంతుణ్ణి స్మరించాడు. వెంటనే గరుత్మంతుడు వచ్చి వాలాడు. తాను కైలాసానికి వెళ్ళాలని చెప్పి కృష్ణుడు గరుత్మంతుడి వీపు మీద ఎక్కి కూర్చున్నాడు. కృష్ణుడితో సహా గరుత్మంతుడు ఆకాశంలోకి లేచి, ఈశాన్య దిక్కుగా ప్రయాణమయాడు.

అలా బయలుదేరిన కృష్ణుడు దారిలో బదరీవనంలో దిగాడు. అక్కడ ఉండే మునులు అతనికి గొప్ప స్వాగతం ఇచ్చారు. వారి ఆతిథ్యం స్వీకరించి కృష్ణుడు ఆ రాత్రికి



అక్కడే ఉండిపోయాడు. అర్ధరాత్రి వేళ అతనికి ఆ ప్రాంతమంతా సంచరించాలని బుద్ధి పుట్టింది. అతను చాలాసేపు బదరీ వనమంతా సంచరించి, ఒక మనోహర ప్రదేశానికి వచ్చి, అక్కడ స్వస్తికాసనం వేసుకుని, సమాధియోగం అవలంబించాడు.

ఆ సమయంలో అటుగా అనేకవేల సంఖ్యలో పిశాచులు మృగాలను తరుము కుంటూ వచ్చారు. వాళ్ళకు నాయకులుగా ఘంటాకర్ణు డనే పిశాచీ, అతని తమ్ముడూ ఉన్నారు. వాళ్ళు కృష్ణు డున్న చోటికి వచ్చి, "ఎవరవు, బాబూ? చూడటానికి నాజూకుగా ఉన్నావు, ఈ వనంలో ఎందు





కున్నావు? నువు రాక్షసుడివా, దేవతవా?" అని అడిగారు.

"నేను యదువంశ క్షత్రియుణ్ణి. దుష్టులను సంహరించటమూ, సజ్జనులకు సంతోషం కలిగించటమూ నా పని. శంకరుణ్ణి చూడటానికి కైలాసానికి వెళుతున్నాను. మీ రెవరు? ఇది సాధుజను లుండే చోటు. ఇక్కడ మృగాలను కూడా హింసించరాదు. మీరు మృగాలను వేటాడుతూ ఇక్కడికి వస్తే నేను సహించను," అన్నాడు కృష్ణుడు.

ఆ మాటకు ఘంటాకర్ణుడు, "నా పేరు ఘంటాకర్ణుడు. వీడు నా తమ్ముడు. నేను విష్ణుభక్తుణ్ణి. ఇదంతా నా సేన. నేను కుబేరుడి కింకరుణ్ణి. విష్ణుపూజ కోసమే మృగాలను వేటాడుతున్నాం గనక దీన్ని హింస అనకూడదు. మరొకటి చెబుతాను విను. నా ఇష్ట దైవం వసుదేవుడి కొడుకుగా జన్మించి ద్వారకలో నివశిస్తున్నాడు. నేను ఇప్పు డాయనను దర్శించటానికే సేనా సమేతంగా బయలుదేరి పోతున్నాను," అని చెప్పాడు.

తరవాత అతను కృష్ణుడి దగ్గరలోనే పేగులు పరిచి కూర్చుని, చేతులు మోడ్చి, తన యిష్టదైవాన్ని ధ్యానించుకో సాగాడు. వాణ్ణి చూస్తుంటే కృష్ణుడికి ముచ్చటవేసింది. వాడు తన భక్తుడు, కాని చేసేవన్నీ పిశాచపు పనులు. కళ్ళు మూసుకుని ధ్యానించే ఘంటాకర్ణుడి మనోనేత్రంలో తన స్వరూపం కనబడేటట్టు కృష్ణుడు చేశాడు. వాడు కళ్ళు తెరిచి చూసేటప్పటికి అదే రూపం కళ్ళ ఎదట కనబడింది. వాడు లేచి ఆనంద పారవశ్యంతో నృత్యం చేస్తూ, "కృష్ణుణ్ణి చూశాను! విష్ణువును చూశాను!" అని కేకలు పెట్టాడు; కృష్ణుణ్ణి రకరకాల స్తోత్రం చేశాడు. తరవాత వాడు తన శూలానికి గుచ్చి ఉన్న శవాన్ని తీసి, కత్తితో రెండుగా నరికి, "ఇది పవిత్రమైన బ్రాహ్మ







అ భయంకర పిశాచి కాస్తా దేవతగా మారిపోయాడు.

త్వరలోనే రాత్రి గడిచిపోయింది. సూర్యోదయమయింది. కృష్ణుడు గంగా స్నానం చేసి, బదరీవనంలోని మునులకు వీడ్కోలు చెప్పి, గరుత్మండుడిపై ఎక్కి కైలాసానికి బయలుదేరాడు. కైలాసం చేర వస్తూ అతను అ కొండ మీది వివరాలన్నీ చూసి, శివుడు చేసిన పనులను స్మరించు కుంటూ చాలా ఆనందం పొందాడు.

అతను మానసరోవరం ఉత్తర తీరాన దిగి, అక్కడి మునులందరి పరిచయమూ చేసుకుని, పన్నెండేళ్ళు తపస్సు చెయ్యటానికి పూనుకున్నాడు. అతను ఫాల్గుణ మాసారంభంలో దీక్ష పుచ్చుకుని, కంద మూలాలు తింటూ పన్నెండేళ్ళపాటు తపస్సు కొనసాగించాడు. పన్నెండేళ్ళు పూర్తి అయాయి. అఖరు రోజున ఇంద్రుడూ, ఇతర దేవతలూ కృష్ణుణ్ణి చూడవచ్చారు. అతను ఏ ఉదేశంతో ఇంత దీర్ఘ తపస్సు చేశాడో వారికి అంతుబట్టలేదు.

ఆ మర్నాడు వృషభవాహనం మీద పార్వతితో సహా శివుడే బయలుదేరి వచ్చాడు. అయన వెంట పుష్పకం మీద కుబేరుడూ, తమ తమ వాహనాల మీద

ఖుడి శవం. భక్తితో నీకు అర్పిస్తున్నాను. తీసుకో," అన్నాడు.

కృష్ణుడికి వాణ్ణి చూస్తే జాలి వేసింది. అతను ఘంటాకర్ణుడితో, "చూడు నాయనా! నాబోటివాళ్ళు పీనుగను తాకరు. ఇటువంటి పూజలు నాకు చాలా అసహ్యం కూడానూ. మామూలు పిశాచాలు చేసే ఇటువంటి పనులు నీ వంటి గొప్పవాడు చేయరాదు. ఎప్పుడూ నన్నే ధ్యానిస్తూ ఉంటావు గనక నేను నీకు ఉత్తమ లోకం ఇస్తాను," అంటూ, ఘంటాకర్ణుడి శరీరం తాకాడు. పరుసవేది తగలగానే ఇనుము బంగార మైనట్టుగా, కృష్ణుడి చెయ్యి తగలగానే

విఘ్నేశ్వరుడూ, కుమారస్వామీ, వాళ్ళకు ముందుగా ఆయుధాలు ధరించి నందీ, మహాకాళుడూ, వెనకగా భూతగణాలూ వచ్చారు. వారంతా పాడుతూ, నృత్యాలు చేస్తున్నారు.

కృష్ణుణ్ణి అంతదూరాన చూడగానే శివుడు పార్వతితో సహా వృషభవాహనం దిగాడు. కృష్ణుడు కూడా శివుణ్ణి దూరాన చూస్తూనే, తన ఆసనం మీది నుంచి లేచి ఎదురు వచ్చి, ఎంతో భక్తితో తలవంచి, నమస్కరించుతూ శివుడి కెదురుగా నిలబడ్డాడు. ఆ సమయంలో అక్కడ చేరిన దేవతలందరూ శివకేశవులను ఒకేసారి చూసి తమ జన్మలు తరించాయని ఆనందపడ్డారు.

కృష్ణుడు శివుడికి సాష్టాంగ ప్రణామం చేసి ఆయనను కీర్తించాడు. శివుడు చాలా సంతోషించి, కృష్ణుడి చేతిని తన చేత్తో పట్టుకుని ఇలా అన్నాడు:

"కృష్ణా, ఇదివరకే నువు తపస్సిద్ధి చేత నా నుంచి వరంగా ఒక కొడుకును పొంది ఉన్నావు. నేను పూర్వం కృత యుగంలో అనేక వందల ఏళ్ళపాటు ఒకానొక సంకల్పంతో అతినిష్ఠగా తపస్సు చేశాను. అప్పుడు నాకు పరిచర్య చెయ్యటానికని హిమవంతుడు ఈడు వచ్చిన



తన కుమార్తెనూ, ఆమె సఖీ జనాన్నీ సమర్పించాడు. నేను కూడా అందుకు అంగీకరించాను. ఆ సందర్భంలో మా ఇద్దరినీ కలపాలని నిశ్చయించి ఇంద్రుడు మన్మథుణ్ణి ప్రేరేపించాడు. ఆ మన్మథుడు నా మీదికి ఎత్తి వచ్చి, నేను సమాధిలో నుంచి బయటికి వచ్చే సమయం కోసం వేచి వుండి, నా గుండె మీద మోహనాస్త్రం ప్రయోగించాడు. వెంటనే నాలో మన్మథ వికారం కలిగి నేను పార్వతి కేసి చూశాను. ఆమె పులకించిన శరీరంతో చాలా అందంగా కనిపించింది. ఎందు కిలా అయిందా అని ఆశ్చర్యపడుతూ నేను చుట్టూ కలయజూశాను. తన దగ్గర ఉన్న ఆయుధాలన్నీ నా పైన ప్రయోగించటానికి సిద్ధపడిన మన్మథుడు కనిపించాడు. అటువంటి దుర్మార్గుణ్ణి చంపితే మాత్రమేమిటని నేను అనుకుంటూండగానే నా ఫాలనేత్రం నుంచి అగ్ని పుట్టు కొచ్చింది. మన్మథుణ్ణి శిక్షించ వద్దనీ, అనుగ్రహించ వద్దనీ ఆకాశాన దేవతలు కేకలు పెడుతూండగానే, అగ్నిజ్వాలలు మన్మథుణ్ణి ఆవరించి, బూడిద చేసేశాయి. ఆ తరవాత బ్రహ్మ మొదలు గాగల దేవతలు వచ్చి, మన్మథుడు ముల్లోకాలకూ మేలు చేకూర్చే వాడని చెప్పగా, బ్రహ్మ ఉద్దేశానుసారం అతన్ని నీకు కొడుకుగా నిర్ణయించాను. అతనే ప్రద్యుమ్నుడు; నీకూ, రుక్మిణికీ కలిగిన తొలి సంతానం. నువ్విప్పుడు చేసిన తపస్సుకు ఫలితం ముందుగానే పొందావు."

తరవాత శివుడు అక్కడ చేరిన మునులు మొదలైన వారిని పలకరించి, కృష్ణుణ్ణి శ్రీమన్నారాయణుడుగా భావించి పూజించమని చెప్పి, అంతర్ధానమైనాడు. అతనితో బాటే పార్వతీ, విఘ్నేశ్వరుడూ, కుమారస్వామీ, నందీ, ప్రమథగణాల వారూ అంతర్ధానమయారు. కృష్ణుడు కూడా బదరీవనానికి తిరిగి వచ్చాడు.





# అరణ్యపురాణం

## 25

మౌగ్లీ కంత కుండా పాకి బయటికి వచ్చేటప్పుడు తెల్లపడగ, "ఆది మృత్యువు! మృత్యువు!" అంటూ విగ్రహాలను కాటు వేస్తున్నాడు.

తిరిగి తమ అరణ్యంలోకి చేరుకోవటంతో కావాకూ, మౌగ్లీ కీ ప్రాణం లేచి వచ్చినట్టయింది. ఉదయపు నీరెండలో మౌగ్లీ అంకుశాన్ని మెరిసేటట్టు తిప్పుతూ పరమానందం చెందాడు.

ఎండలో మెరిసే కెంపును చూసి అతను, "ఇది బాఘీర కంటి కన్న కూడా బాగా మెరుస్తున్నది. దీన్ని అతనికి చూపించాలి. అయితే ఆ బెరడుగాడు మృత్యువు గురించి ఎందుకు మాట్లాడినట్టు? నన్ను భయపెట్టాలనా?" అన్నాడు.

"నా కేం తెలును? నువు వాణ్ణి కత్తితో చంపెయ్యాలే దన్నదే నా విచారమల్లా... ఈ పూట వేటకు పోదాం, వస్తావా?" అన్నాడు కావా.

"లేదు. దీన్ని బాఘీరకు చూపాలి.... వేటసాగాలి!" అంటూ మౌగ్లీ పరిగెత్తుతూ, మధ్యమధ్య వంగి తన చేతిలోని అంకుశాన్ని చూసి అనందిస్తూ, బాఘీర ఉండే అరణ్య ప్రాంతానికి చేరుకున్నాడు.

బాఘీర అప్పుడే సుష్టుగాతిని, నీరు తాగుతూ కనిపించాడు. మౌగ్లీ తన అనుభవాలన్నీ పూసగుచ్చినట్టు చెబుతుంటే, బాఘీర ఆలకిస్తూ అప్పుడప్పుడూ అంకుశాన్ని మూజూశాడు. తెల్లపడగ అన్న అఖరు మాటకు బాఘీర ఆమోదం తెలపటం గమనించి మౌగ్లీ, "అయితే తెల్లపడగ అన్న మాట నిజమే నంటావా?" అన్నాడు.

"తమ్ముడూ, నేను ఉదయపూరు రాజా గారి బోనులో పుట్టినవాణ్ణి. నాకు మనుషుల

అట్ట చివరి బొమ్మ



సంగతంతా తెలుసు. ఆ ఎర్రరాయి కోసం ఒక్క రాత్రిలో మూడు హత్యలు చేసేవాళ్లు చాలామంది ఉంటారు," అన్నాడు బాఘీర.

"చేసేటందు కేమీ లేకపోతే మనుషులు హత్యలు చేస్తారని నాకూ తెలుసు. ఈ ఎర్ర రాయి తినటానికూడా పనికి రాదే, దీని కోసం చంపటం దేనికని!" అన్నాడు మౌగ్లీ.

"మౌగ్లీ, నువు పడుకుని నిద్రపో! మనుషుల మందలో ఉన్నావు, కాని ఏం లాభం?" అన్నాడు బాఘీర, నిద్ర ముంచుకొస్తూ.

"ఈ ములికి గల వస్తువుతో ఏం పని, బాఘీరా?" అని మౌగ్లీ అడిగాడు.



"మనుషులు హాథీ సంతానాన్ని తలలో పొడిచి రక్తం తెప్పించటానికి! అలా మనిషి ఆజ్ఞలను అమలు చేసుకోవటానికి! గోళ్ళూ, కోరలూ లేని మనిషి ఇటువంటివీ, ఇంకా ఘోరమైనవీ సృష్టించుకున్నాడు!" అన్నాడు బాఘీర.

"ఛీ, ఛీ! మనిషిమందకు సంబంధించిన ప్రతిదీ రక్తం కళ్ళ చూసేదే! ఈ సంగతి తెలిస్తే దీన్ని తీసుకురాకనే పోదును," అంటూ మౌగ్లీ తన చేతిలో ఉన్న అంకుశాన్ని దూరంగా విసిరి వేశాడు. అది తళతళా మెరుస్తూ వెళ్ళి, ముప్ఫై గజాలదూరాన నేలలో గుచ్చుకున్నది. మౌగ్లీ మంచుతో తడిసిన గడ్డిమీద చేతులు రుద్దుతూ, "పీడ వదిలించుకున్నాను. ఆ బెరడుగాడు నేను చస్తానన్నాడు. పాలిపోయిన ముసిలి, వెర్రి పీనుగు!" అన్నాడు.

"రాత్రల్లా వేటాడి, పగలల్లా వాగటం నా వల్ల కాదు. నేను నిద్రపోతున్నాను, చిన్న తమ్ముడూ," అన్నాడు బాఘీర తన చోటికి బయలుదేరిపోతూ.

మౌగ్లీ మంచి చెట్టు చూసుకుని ఎక్కి, లతలు అల్లి ఉయ్యాల చేసుకుని, అందులో ఊగుతూ నిద్రపోయి, అందమైన ఎర్ర రాయి గురించి కలగన్నాడు. తిరిగి అతనికి



మెలకువ వచ్చేసరికి చీకటి పడుతున్నది. మర్కటులు చెట్లమీద పెద్దగా అరుస్తున్నారు.

"దాన్ని ఇంకోసారి చూసుకుందాం," అనుకుంటూ లతలుపట్టుకుని అతను కిందికి దిగి వచ్చాడు. అప్పటికే బాఘీర అక్కడ తారట్లాడుతూ, వసికట్టుతున్నాడు.

"ఆ ములికి గల వస్తువేమయింది?" అన్నాడు మౌగ్లీ.

"ఎవరోమనిషి తీసుకున్నాడు. ఇవిగో వాడి అడుగుజాడలు," అన్నాడు బాఘీర.

"బిరడుగాడు చెప్పినది నిజమైతే ఆ మనిషి చావాలి. జాడలవెంబడి పోదాం," అన్నాడు మౌగ్లీ.

"జాడ లెక్కడికీ పోవు. ముందు కడుపు నింపుకుందాం," అన్నాడు బాఘీర.

వాళ్ళకు త్వరలోనే ఆహారం దొరికింది. ఇద్దరూ కడుపునిండా తిని, తాగి, అడుగు జాడల ననుసరించి బయలుదేరారు. ఆ కాలిగుర్తులు గలవాడు, కొంతదూరం నడిచి తరవాత పరిగెత్తి, చివరకు ఒక పక్కకు తిరిగాడు. ఆ ప్రదేశంలోనే ఇంకోమనిషి కాలి గుర్తులు మొదటి గుర్తులను చేరవచ్చాయి. ఈ రెండోజత పాదాలు చిన్నవి. కాలి వేళ్ళు లోపలికి మణిగి ఉన్నాయి. అవి గోండు వేటగాడివని మౌగ్లీ గ్రహించాడు.



రెండు జతల జాడలుండటం చేత మౌగ్లీ చిన్న అడుగుల వెంటా, బాఘీర పెద్ద అడుగుల వెంటా చీలి నడుస్తూ, తాము గ్రహించిన విషయాలు ఒకరి కొకరు కేక పెట్టి చెప్పుకున్నారు.

చివరకు రెండు జాడలూ ఏకమయాయి. ఆ దారిలోనే ఒక గ్రామస్థుడి శవం దారికి అడ్డంగా పడి ఉన్నది. వాడి గుండెలోకి వీపులో నుంచి గోండువాడి బాణం గుచ్చుకుని ఉన్నది. "ఒకచావు! ఆ వస్తువేదీ?" అన్నాడు మౌగ్లీ.

"గోండువాడు తీసుకుని ఉంటాడు," అంటూ బాఘీర, చిన్న పాదాలజాడ వెంబడి

దారి తీశాడు. కొంతదూరం వెళ్ళాక ఒక కనుమలో నెగడు వేసిన చోట గోండువాడి శవం దొరికింది. రెండో చావు! అక్కడే పాదరక్షలు ధరించిన నలుగురి కాలిగుర్తులు కనిపించాయి.

మౌగ్లీకి ఇక ముందుకు పోబుద్ధి కాలేదు. కాని బాఘీర, వెనక్కు తిరగటం వేటగాడి లక్షణం కాదన్నాడు.

ఆ నలుగురి అడుగు జాడల ననుసరించి వాళ్ళు ఒక గంటసేపు నడిచాక బాఘీరకు పొగవాసన తగిలింది. ఆ ప్రాంతాలలోనే పొదల మధ్య బాఘీరకు మరొక శవం కనిపించింది. వాణ్ణి ఎవరో కొట్టి చంపారు. గోండువాడు చచ్చినట్టే వీడూ చచ్చాడు.

మరో అరమైలు వెళ్ళాక వాళ్ళకు ఆరిపోతున్న నెగడూ, దాని పక్కన మూడు శవాలూ కనిపించాయి. ఎవరి మీదా గాయం లేదు. "వీళ్ళెలా చచ్చినట్టు?" అన్నాడు మౌగ్లీ ఆశ్చర్యంగా.

"విషం!" అన్నాడు బాఘీర. వీళ్ళ చేతిలో చచ్చినవాడు వంటవాడు. వాడు ముందుగానే మిగిలిన వాళ్ళ ఆహారంలో విషం కలిపాడు. అంకుశం నెగడు పక్కనే పడివున్నది.

మౌగ్లీ దాన్ని శిథిలాలనుంచి తెచ్చినందుకు చాలా పశ్చాత్తాప పడ్డాడు. అతను దాన్ని ఒక చోట తాత్కాలికంగా పూడ్చి ఉంచి, రెండు రోజుల అనంతరం రాత్రి పూట తెల్లపడగ ఉండే చోటికి వెళ్ళి, రంధ్రం కుండా ఆ అంకుశాన్ని లోపలికి వేసి, "సర్ప పితామహా, మంచి యువకుణ్ణి రాజనికేప రక్షణకు తోడు తెచ్చుకో! లోపలికి వచ్చిన వాడు ప్రాణాలతో తిరిగి పోకుండా చూడు!" అని చెప్పాడు.

"ఓహో, ఇది తిరిగి వచ్చిందా? నువ్వింకా బతికే ఉన్నావా? నువ్వు చావెలా తప్పించుకో గలిగావు? ఎంత ఆశ్చర్యం!" అన్నాడు తెల్లపడగ.



# 79. వింత పర్వతపంక్తులు

ఆస్ట్రేలియా నడిమయాన, మకరరేఖ మీద ఉన్న మక్‌డోనెల్ పర్వతపంక్తులు, చాలా విచిత్రమైనవి. ఇవి బాగా అరిగిపోయిన పర్వతాలు. వీటి నిడివి 250 మైళ్ళు.



Photo by Vida Chandra Patwa



బహుమతి
పొందిన వ్యాఖ్య

కూటికి లోటు లేదు

పంపినవారు,
కె. రహమాన్, మచిలీపట్నం

Photo by Anant Desai



బహుమతి
పొందిన వ్యాఖ్య

గూటికి చోటు లేదు

పంపినవారు:
కె. రహమాన్, మచిలీపట్నం

# ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1968 ఆగష్టు నెల సంచికలో ప్రకటించబడును





★ పై ఫోటోలకు సరి ఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ జూన్ నెల 20-వ తేదీ లోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డు పైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు—26.

---

## జూన్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో: కూటికి లోటు లేదు

రెండవ ఫోటో: గూటికి చోటు లేదు

పంపినవారు: కె. రహమాన్,

ఎల్. ఇ. ఇ. మచిలీపట్నం.

బహుమతి మొత్తం రు. 10/—ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

Printed by B. V. REDDI at The Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for Sarada Binding Works, 2 & 3, Arcot Road, Madras-26. Controlling Editor: 'CHAKRAPANI'

